శ్రీః.

# శృంగార సావిత్రి

తంజావూరి

రఘునాథరాయలు

ప్రణీతము

ప్రకాశకులు:

జి. ఎస్. శాస్త్రి అండు కో.,

మద్రాసు.

సావిత్రి సత్యా [illegible]

# సర్వస్వామ్యములు

గ్రంథకాళకులవి



లండన్ రాయల్ యెడిషన్

1928

చెన్నపురి:

ఇండియా ముద్రణాలయమున

ముద్రితము.



సావిత్రీ-సత్యవంతులు

# పీఠిక

ఉ॥ తారసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ గవించి మహి మించినవో నిఁక నన్యు లెవ్వరె
య్యా! రఘునాథభూపరసికాగ్రణికిం జెవిసోఁకఁ జెప్పఁగన్.

విజయవిలాసము.

## తంజావూరి రఘునాథరాయలు.

క్రీ. 1650 సం॥ ప్రాంతముల దక్షిణభాగదేశమునకుఁ గల్గిన సౌభాగ్యమంతయుఁ బూర్వమెన్నఁడుగాని, తర్వాత నేఁటి దాఁకఁ గాని కలుగలేదు. ఇఁక ముందుగూడఁ గలుగఁబో దేమో! మహాకవి, మహాగాయకుఁడు, మహావిద్వాంసుఁడు, మహాదాత, మహాశూరుడు, మహాభక్తుఁడు, మహానుభావుఁడు, మహామహుఁడు రఘునాథరాయఁడను నాంధ్రనాయకరా జాకాలమున దేశమెల్ల నిత్యకల్యాణము, పచ్చఁదోరణము నై చెలువొందఁ దంజావూరు రాజధానిగాఁ జోళరాజ్యమును బరి

పాలించెను. ఆ కాలమున పందలకొలఁదిగా నిత్యాన్నదాన సత్త్ర
సత్రములు వెలసెను. పందలకొలఁదిగా నసాధారణ శిల్పసౌం
దర్యముగల దేవాలయమంటపగోపుర ప్రాకారాదులు వెలసెను.
ప్రతిగ్రామమునకును గావేటికాల్వలు పాటింపఁబడెను. ఈతి
బాధలకు, క్షామమునకు, ప్రజాక్షోభమునకు నాదేశమున నిలువ
నీడ లేకుండఁ జేయఁబడెను. సరససంగీత చాతుర్యములు, నవర
సాభినయనైపుణ్యములు, ప్రశస్తశిల్ప చిత్రవాస్తువస్తు నిర్మా
ణములు, మధురతర సంస్కృతాంధ్ర కవితాకల్పనములు,
విద్వద్గోష్ఠులు, సకలశాస్త్రచర్చలు, కనకాభిషేకములు, గ్రామ
గజాందోళికాచ్ఛత్ర చామరాది బహుమానములు, నిత్యో
త్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, ఋతూత్సవాయనోత్సవ వత్స
రోత్సవాది దేవోత్సవములు, వివిధయజ్ఞ విప్రోక్తసు విహార
ములు, షోడశ మహాదానములు, శరణాగత రాజరక్షణములు
నాఁటి ముచ్చటలు. మేలుపూఁదీగలఁ బోలుమెలఁతలు, సం
స్కృతాంధ్ర భాషలందు సరసకవితలు నేర్చినవారు, సంగీత
మందు బిరుదందెలందినవారు నాఁడు వేలకొలఁదిగానుండిరి.
సర్వక్రతువులు సల్పినశ్రౌతులు వేలకొలఁదిగానుండిరి. సత్కా-
వ్యకర్తలు, శాస్త్రకర్తలు, వేలకొలఁదిగానుండిరి. వీరెవ్వరును
రఘునాథరాజును రాజమాత్యునిఁగాఁ దలఁపరయిరి. తండ్రిని
గాను గురునిఁగాను వేల్పునుగాను ప్రాణము ప్రాణమునుగాను.

భావించిరి. ఆయన చరిత్రమునుఁ గొందఱు కవులు సంస్కృత కావ్యములుగా, నాంధ్రప్రబంధములుగా, నాటకముగా, యక్ష గానములుగా, ద్విపదలుగా, పాటలుగా, నింక నెన్నేని తీరు లుగా వర్ణించియు, వర్ణింపఁ జాలమైతిమని వగచిరి. ఒక మహావిద్వాంసుఁడు తా నాయనశిష్యుఁడనని చెప్పుకొనియెను. ఒకమహావిద్వాంసుఁ డాయన పేర నాలుప్రబంధములు రచి యించెను. ఇతరు లాయన పేర నెన్నెన్నేని కృతుల రచించుట కాదు. ఆయనయు ననేక కృతుల రచియించెను. రామాయణము, వాల్మీకిచరిత్రము, పారిజాతాపహరణము మొదలైనవి తెలుగు నను, రామాయణసంగ్రహము, సంగీతసుధ మొదలయినవి సంస్కృతమునను నామహాకవి రచించిన కృతులు. ఆయన రచించిన రామాయణమును మధురవాణియను వేశ్య సంస్కృత మునఁ బరివర్తించెను. రెండుజాములలో పారిజాతాపహరణ ప్రబంధము నామహాకవి రచించెనఁట.

## సావిత్రీ చరిత్ర

రసవంతమగు నీ ప్రబంధమునుఁ గూడ నామహారాజ కవియే రచించియుండు నని మే మనుకొనుచున్నాము. దీని మూలము తంజావూరి సరస్వతీ పుస్తకశాలలో నున్నది. అది ప్రాఁతపుస్తకము. గ్రంథారంభ మొక యాశ్వాసము లేనట్లు న్నది. ఆశ్వాసాద్య పద్యములు, ఆశ్వాసాంత్య పద్యములు

లేవు. నడుమఁగూడ నొకచోఁ గొంత గ్రంథపాతమున్నది. ఈ గ్రంథమును ముగియరచింపక పూర్వమే గ్రంథకర్త స్వర్గస్థుఁడై యుండునని యూహము. ఆప్రతినిబట్టి తత్కర్తను గుర్తింపఁగుదురదయ్యెను. కాని శ్రీ రఘునాథరాయ మహాకవి రచియించిన రామాయణమందలి పద్యములు (ఋష్యశృంగ తపోభంగము పట్టుననున్నవి.) ఈగ్రంథమునందును నుండుటచే తత్కర్తయే యేతత్కర్తయగునని మేమూహించితిమి.

రామాయణము, వాల్మీకిచరిత్రము, మొదలగు రఘునాథరాయల కృతుల రచనములకును, ఏతత్కృతి రచనములకును చాల పోలికగలదు. మహాభారతారణ్య పర్వమున మార్కండేయముని ధర్మరాజునకుఁ జెప్పినట్టుగా ఈ సావిత్రీచరిత్ర కథయున్నది. ఈ ప్రబంధమునను గూడ నట్లేగలదు. రఘునాథరాయఁడు రామాయణమును రచియించినట్లే భాగవతమును గూడఁ దెలుఁగున వేఱొక పద్యకావ్యముగ రచింపఁబూనెనేమో? ఇది దానిలోని యొక కథపట్టు అగునేమో?

## కవితా విశేషము.

ఇందు సందర్భితములయిన రాజాస్థానమర్యాదలు, హాస్యప్రసంగములు, వేశ్యావినోదములు, సంభోగ శృంగారములు రఘునాథరాయలనాఁటి తంజాపూరి సౌభాగ్యములను, కవితా

సౌకుమార్యములను, ఆస్థానసంప్రదాయములను, నెల్లడించు
చున్నవి.

తేటతేట కూర్పులు, భావవైశద్యములు, సరసపద సంధా
నములు ఈగ్రంథమునకుఁ బ్రశస్తిని గూర్చుచున్నవి. దూరా
న్వయముగాని, క్లిష్టపద రచనగాని యిందుఁ గానరాదు. నాఁటి
యభిరుచుల కనుగుణముగాఁ గాఁబోలును శాంతరసమున కెక్కు
వగా సంభావనము కల్గవలసిన యేతత్కథాప్రబంధమునఁ గూడ,
శృంగారరసమునకే సంభావన చాలగా దొరకెను. హాస్య రచన
యిందు మిక్కిలి యానందింపఁ దగినంతవింతగా నంతరింపఁబడి
నది. రాధా మాధవమునలె నీకృతియు రసికరంజకమై వెలయఁ
గలదని నమ్ముచున్నాము. ఇందు లోపించిన యాశ్వాసాద్యాం
త్యపద్యములు కథాభాగములు ఇంక నెక్కడనేని దొరకఁ
గల్గుననునాశ మాకులేదు. తంజాపూరిలోనే లేకపోఁగా నిఁక
నెక్కడ దొరకును? అట్లు దొరకుభాగ్యమే కల్గునేని పున
ర్ముద్రణమున పూరించి సరిపఱుతుము.

దీని మూలప్రతిని తంజాపూరి పుస్తకశాలనుండి బ్రహ్మ
శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు స్వహస్తముతో వ్రాసి
తెచ్చుకొని యుండిరి. మాప్రార్థనలమీఁద వారు దానిని, బ్రక
టించుటకు దయచేసిరి. వారి తోడ్పాటుచేతనే యనాయాస
ముగ దీనిని మేమిపుడు ముద్రింపఁగల్గితిమి. ఇట్టి యుత్కృష్ట

గ్రంథమునుఁ బ్రకటింపనొసంగి మాకుపకృతి సల్పిన శ్రీరామకృష్ణకవిగారికి వందనసహస్రము లర్పించుచున్నాము.

మా శృంగార గ్రంథమాలలో నీ సావిత్రీచరిత్ర పంచమ కుసుమమై విరాజిల్లుచున్నది. ఇంతవఱకు ఆంధ్రభాషాయోషకు ప్రాచీన సరసహృద్యపద్యభాసురములగు ప్రబంధ గ్రంథ కుసుమముల నైదింటినైనను సమర్పింపఁ గలిగినందులకుఁ సంతసించుచున్నాము. ఈప్రాచీనప్రబంధమునునికిని దెలిపి, శ్రీకవిగారిచే మాకిప్పించి యీపీఠికావిషయమును మాకు వ్రాసియిచ్చి యుపకరించిన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారికి మాకృతజ్ఞతాపూర్వక వందన సహస్రము లర్పించుచున్నాము.

విభవ వైశాఖి. } గంటి. సూర్యనారాయణశాస్త్రి,
సంపాదకుఁడు.

శ్రీః

# శృంగార సావిత్రి

## ప్రథమాశ్వాసము

అవధరింపుము పాండవేయాగ్రజునకు
నవలికథయందుఁ గల్గువృత్తాంత మెల్ల
నానుపూర్విగఁ జెల్ప నమ్మౌనిచంద్రుఁ
డింపుపలుకుల మై పులకింపుచుండ.

గీ. మద్రదేశాధినాథుఁ డమ్మాడ్కి నుగ్ర
తపముఁ జేయుచు నుండఁగ ధరణినాథ,
స్వర్గమునఁ గొన్నివింతలు చాలఁ బొడమె
విన్నవించెద నవి యెల్ల విస్తరించి.

మ. అఱువైయేవురువేలుపుంగలుకు లో
య్యారంబుగాఁ గుల్కఁగా
వరుసన్ ముప్పదిమూఁడుకోట్లుసురలున్
వర్ణింపుచుం గొల్వఁగా

స్థిరవాక్యంబుల నారదాదిమును లా
శీర్వాదముల్ సేయఁగా
నెఱనీ కై యలపాకశాసనుఁడు దా
నిండోలగం బుండఁగన్.

సీ. ఎదురైనచోఁ బారు లేమియో మ్రుని వేఁడ్ర
మఱియేమి లే వన్ని మంచి వనుచు
నయ్యాకుఁ బైన మా నని జయంతుఁడు వేఁడ
విన్నవించెద నంత కున్న దనుచు
నన్న మా కేమంటి వనుచు మేనక వేఁడ
నీదాఁక వచ్చెనే నిలుఁవు మనుచు
వాఁకిటికొల్వు లెవ్వఁడ వంచుఁ దను నాఁగఁ
గన్నఁ గానరె యంచుఁ గదుముకొనుచు
నిలువ కెవ్వరిఁ జూడక తెలివి లేక
యించుకించుక దగ వగరించుకొనుచుఁ
బాకశాసనుహుజూరునందాఁక నొకటఁ
జారుఁ డొక్కఁడు బిఱబిఱఁ బాఱుతెంచి.

గీ. స్వామి, యవధారు దేవతాసార్వభౌమ,
స్వర్గసింహాసనాధ్యక్ష, వసుధ నున్న

బదరికాశ్రమమందుండి యిదిగో యిపుడు
వెడలి వచ్చితి నొకవార్త విన్నవింప.

గీ. గాలి చొరరాకయున్న యక్కాననమున
నొక్కనృపుఁ డెవ్వఁడో కాని యుగ్రతపము
సేయఁ గూర్చుండె నాతపస్స్థితికి నాక
వనము నీఱయ్యెఁ గువలయం బనువుదప్పె.

సీ. ఏమి కావలె నంచు నెదుటఁ దోఁచి విధాత
యెంత వేఁడిన వచియింపఁ డయ్యె
వరము లిచ్చెద నంచు హరిప్రోల వేంచేసి
లె మ్మన్న నింత చలింపఁ డయ్యె
ఫల మొసంగితి నంచు భవుఁడు ప్రత్యక్షమై
మొనసినఁ జే యెత్తి మ్రొక్కఁడయ్యె
చాలు మెచ్చితి నంచు శాంభవి యటు నిల్చి
చేయి చూపినను వీక్షింపఁ డయ్యె
విబుధకులనాథ, తపము నా విన మొ కన మొ
నాటితరమైన తపముచందంబు గాదు
తెలియఁ గోరిక యెద్దియో తేటపడదు
వింత యై తోఁచె నేమని విన్నవింతు.

క. అన విని యేమేమీ యని
పని యిది బాగాయె నని తపంబులవింతల్
ఘన మాయె నని సురోత్తముఁ
డనియెన్ దనయంతరంగ మవియం గలఁగన్.

ఉ. సమ్మతి మిమ్ము నమ్మి తగు
చారు లటంచును వేగుపంపి నే
నెమ్మది నుంటి నేనునుచు
నేఁ డెఱిగింపఁగ వచ్చి తీవు వాఁ
డెమ్మెయి నుండు నేపదవి
కెవ్వరిఁగూర్చి యేతపంబు భా
వమ్మునఁ జేయఁ బూనె నొక
వార్తయుఁ జెల్పవు పోలుఁబొందుగన్.

క. అని ముందు వెనుక తోఁచక
మనమునఁగళవళము దోఁపనునకిఁకవిూఁదన్
బని యే మని తను వేఁడిన
మునుపుగఁదలపోసివినయమునగురుడనియెన్.

గీ. ఓసురాధినాథ, యోజింప నేటికి
వానితపము పెంపు వాని తెంపు

తెలియ విన్నయప్పుడె తెల్లమిగాఁ దోఁచె
నింతతపము సేయ నెవ్వఁ డోపు?

క. విశ్వామిత్రుఁడు గావలె
శాశ్వతసామ్రాజ్యపూజ్యసంపన్నిధి యా
నశ్వపతినృపతి గావలె
నీశ్వరునకు వశమె తపము లీవిధిఁ జేయన్.

గీ. కౌశికుఁడు గాఁడు నేఁడు నాకడకు వచ్చి
మేనకకు దానుఁ గుజరాతిమేలికోపు
లెత్తి చేరువ వేసితి నింతసేపు
సాముచూడంగ రమ్మని చలముసేసె.

ఉ. కావున మద్రదేశజన
కాంతుఁడ కావలెఁ గాక యున్నచో
నీవును నే నెఱుంగ ధర
ణీపతి కెవ్వని కింతసాత్త్విక
శ్రీ విలసిల్లఁగాఁ దపము
సేయ సమర్థత గల్గు నందుపై
దేవరచిత్త మేక్రియఁ బ్ర
తిక్రియఁ జేసెదొ చేయు మంచనన్.

క. మంచిది యని నికటతట
ప్రాంచచ్చంచలదృగాననాంబుజములపై
నించునల తేఁటిదాఁటుల
నెంచం దగుచూపు లించుకించుక నిగుడన్.

ఉ. అందఱిఁ బాఱఁజూచి యమ
రాధిపుఁ డిందఱిలోన నెవ్వ రా
టందును బాటయందుఁ జదు
వందును మించినజాణ లట్టివా
రందుకొనుందు వీఁడె మన
నందఱు మోములు చూచుకొంచు నీ
వందుము నీవ యందుకొను
మందు రెటుం జెయి చాఁప రెవ్వరున్.

గీ. అటు లిటులు చూచి వారిత్రొక్కటలు సూచి
యెన్నఁటికి నాటపాటలవన్నె లనుచుఁ
గంకణఝుణంఝుణధ్వనుల్ గ్రమ్ముకొనఁగ
నిగ్గిడి మేనక కేల్ దోయి మొగిచి నిలువ.

శా. ఔనే మేనక, వన్నెఁ దెచ్చితివి వి
శ్వామిత్రజాగ్రత్తపో

హాని జేసినదాని కెంతపని నీ
  వాపాటచే నాటచే
నాసం బూనక యున్న నొండొరులచే
  నౌనే నినుగా మాన కా
మానుల్ నీయుచు మోవిపానకములన్
  మైవెంతు రెల్లప్పుడున్.

క. తలవంపు లాయె రంభకు
నలతారకు మోము తెల్ల నాయెను మిగులన్
గళ దఱిగెను శశిరేఖకుఁ
గలికీ, నినుఁజూచి విడెముఁ గైకొను మింకన్.

క. కంతుని వసంతు రజనీ
కాంతునిఁ బవమానశుకపిక ప్రకరములన్
గొంతసహాయము సేసెదఁ
గాంతా,పనిగొమ్ము పొమ్ము క్రమ్మఱు మంచున్.

గీ. ఉడుగరయుఁ గొన్నిసొమ్ములు విడె మొసంగి
పసుపుపావడ పైఁడందె పచ్చపూలు
గెలిచివచ్చిన నొసఁగెదఁ బలుకు లేల
యతివ, యిది మాటవాసి పొమ్మంచుఁ బనుప.

చ. తొలఁకెడుచిన్ని లేనగవు
తోఁ గరతోయజముల్ మొగిడ్చి ము
ద్దులనునుఁజెక్కుటద్దముల
తోఁ గళతో మరుఁ డెత్తు పువ్వుగు
త్తులవలె నున్నచన్నుఁగవ
తో వగతో విడఁబాటు నీటు రీ
తులఁ దగుచూపుక్రొందళుకు
తోఁ జెలితోఁ దిరిగెన్ గిఱుక్కునన్.

క. ఇరుగెడల నూడిగంపుం
జెలువలు మఱఁజెక్కుపువ్వుఁదేరులవలెఁ జన్
గిరుల నిడుముత్తెసరులన్
విరులం దగుజడలు మెఱయ వెంబడి నడవన్.

గీ. తురగముల నెక్కి మధుఁడుఁజందురుఁడు దెరల
మదపుటేనుఁగుపైఁ బవమానుఁ డరుగఁ
దనబలముతోడఁ బారియుండలములోనఁ
గమ్మవిలుకాఁడు రా మేనకావధూటి.

క. తానును దనచెలికత్తెలుఁ
బూనుకొని విమానమెక్కిఁ బోవఁగనిలు మో

మేనక, యని కౌశికముని
తో నరిగెఁ బొజ్జ గదల దోవతి వదలఁగ.

గీ. అరిగి పయ్యెదకొంగు చే నదిమి పట్టి
యెట్టు వచ్చితి వని బుగ్గ నొట్టుకొనుచు
నలుక నేమేమొ యనఁ బోయి యంతలోన
నతివనగుమోముఁ జూచి దీనతను బలికె.

సీ. ఇంతి, నీ వేవేళ నేమి గావలె నన్నఁ
దెప మెల్లఁ జెటిపి నీతలఁపుఁ దీర్తు
నెలఁత, నీ వారుఁ గూడి నేఁడు గూడ దటన్నఁ
బాటి చుట్టుపు నీదుపడుకయిల్లు
వనిత, నీపదుచుల కెన లేనికోపుల
చేరున వేసి మెచ్చింతు నిన్ను
కలికి, ని న్నెవ్వరుగా దన్న వానితోఁ
జే సాఁచి జగడముల్ సేయఁ బోత్తు
నింత దయవాఁడ నగుటచే నెంత కైనఁ
బూని పెద్దతనం బెల్ల బూదిఁ గలిపి
జపతపంబులు విడనాడి జడుఁడ నైతి
*పెలఁదికడ నీరు గానైతి వెఱ్ఱి నైతి.

* (పెలఁది నీకరి గానైతి వెఱ్ఱినైతి)

ఉ. అక్కట ! నీవు నన్ను విడ
నాడి చనం బద మెట్టులాడె ? నే
నెక్కడ నిల్తు ; నిల్చి మఱి
యెవ్వరిఁ జూతును ; చూచి ప్రాణ మే
నిక్కము గాఁగ నేకరణి
నిల్పుదు ; నిల్పిన లాభ మేమి ? నీ
వక్కఱ కైనదాన వని
హా! మది నమ్మితి దేహ మమ్మితిన్.

చ. ఒకరికిఁ గాక పోతి నని
యెన్నరు మం చన నింత యేల నే
నొక టని నీవు నొక్క టని
యున్నదె దేహము నీయధీన మం
చొకవగ పావురాపలుకు
లొయ్యఁ జెవిం జొరఁ జేసి యొమ్మ యొ
మ్మొకటఁ గదించి చన్నుఁగవ
నొత్తి చుఱుక్కన మోవి నొక్కుచున్.

గీ. వంత విడు నేఁడు రే పటు వత్తు ననుచుఁ
గొంత లాలించి తేలించి కుస్తరించి

మునిజనవిరించి మరలించి ముదము గాంచి
మేన బోటులుఁ దాను విమాన మెక్క.

చ. మదనుఁడు తోడ రాఁగఁ బవ
మానుఁడు ముంగలఁ బోవఁ జంద్రుఁడున్
బదరక యింత నంతఁబయి
పాటున క్రమ్మఱ రా వసంతుఁ డా
మధుశుకశారికాపిక స
మాజముతో నెలగోలు గాఁగఁ బో
నదె యిదె యంచు నాబదరి
కాశ్రమభూమికిఁ జేరి రయ్యెడన్.

క. ఒకగుజ్జుమావిక్రిందను
మకరాంకునితోడఁ దాను మంతనముగ మే
నక కొంతసేపు యోజన
ప్రకటించి, దృఢీకరించి, పచరించి వెసన్.

గీ. చెలియకైదండ గాని లేచి బలము నీవు
నిలిచి రమ్మని మరుని కన్గిటి బోటి
తానుఁ దనమేళమును గూడి తపసిపల్లె
నల్లనల్లనఁ జేరఁ బో నాడ నాడ.

సీ. అలదేవపూజకై యగ్రోదకంబులు
    గొనివచ్చు నేనుఁగుగుంపుఁ జూచి
మొనసి పార్థివలింగమునకు మెత్తనిమృత్తి
    కలు మోచిచను పందికదుపుఁ జూచి
హరిసమర్పణకు నై పరిపక్వఫలరాజి
    వెసఁ దెచ్చుభల్లూకవితతిఁ జూచి
గుమిగూడి శివపూజకొఱకు దూర్వాంకుర
    మ్ములు దెచ్చులేఁటిపిల్లలను జూచి
వెఱచి తల యూఁచి యీర యీవింతవగలు
కన్నవిన్నవి గావు లోకంబునందు
నన్నిచట నేమిగాఁ జేయనున్నవాఁడొ
దేవుఁ డిఁక నేఁటి కని మేనఁ గావభహాటి.

క. అటచని ముందటఁ గనె నా
వటమగు నొకవటముక్రింద వాడినరొమ్ములున్
గటిదాఁక వ్రేలుజడలున్
జిట్లిలినమైబూదిపూఁతలు చెలు వగుతపసిన్.

క. పొడగని గడగడ వడఁకుచుఁ
గుడిమెడమల మెలఁగుపడఁతిగుంపులఁ గేల్గా

గడ కనిచి నిలిచి యించుక
తడవు విలోకించి యిది గదా తపమన్నన్.

ఉ. మౌనము జోమ్ములో నిబిగు
(మౌనము నందపు మేనినిగ్గు) సి
గ్గూనిన మోము సై కదల
కుండు దృఢం బర మోడ్పుఁ గన్నులౌ
రా! నుతియింపఁగా వశమె
రాజకుమారకుఁ డాట నంత ము
ద్దైన తపంబు చేసెడి న
యారె యొయారము (మీాఱునీవిధిన్)

సీ. సొగసైన నా మోముఁ జూడఁగల్గినఁ జాలుఁ
గలువ ఱేఁ డున్నాఁడు కడమ కెల్ల
నునుదావియూర్పుమూర్కొనఁగల్గిననుజాలుఁ
బవమానుఁ డున్నవాఁ డపలి కెల్ల,
గలుకు చూపు లెఱుంగఁ గల్గినఁ జాలును
గొనితూపు లున్నవి కొదవ కెల్లఁ
నింపుఁబల్కుల నాలకింపఁ గల్గినఁ జాలుఁ
జిలుక చా లున్నది వెలితి కెల్ల

ననుచుఁ దలపోసి తత్తరంబును దలంచు
నయము వినయంబు దోఁపఁ బంతంబు చూప
సమయ మని వారివారి హెచ్చరిక నునిచి
ముకుళితాంజలి యై మాని ముందర నిలిచి.

క. ఆటల పాటల మాటల
తేటల నీటులను వగకుఁ దేలేక వితా
పా టాయెఁ జెవిటిముందటఁ
జాటించుచు సంకువట్టు చందం బయ్యెన్.

మ. (అనుపొందన్ మునుముందు గుబ్బచను) లో
యార్యంబుగా గోళ్లఁ చేఁ
గొని పో మీటుచు ముత్తెపున్ సరుల చి
క్కుల్ చక్కఁగాఁ దీర్చుకొం
చు నునుంజెక్కునఁ జేయి సేర్చి మొగము
చ్చో వాంచి పాదాంగుళం
బున (నేలన్ విలిఖించుచాతపసి) మో
మున్ దీనతన్ జూడఁగన్.

ఉ. అంతట దైవయత్నమున
నమ్మని జెప్ప లోకింత విచ్చి గో

రంత ప్రపంచముం గనిన
నంతఁ దళుక్కునఁ దోఁచె మేనకా
కాంత పసిండిమేను గల
కాం (చిరవంబుని మేనివల్పు దా)
నంత వడిన్ ఘటించుతప
మాకరణిం ఫలియించెనో యనన్.

క. మగనీట్టూ నగుబాటూ
మొగమోటూ లేక తపసి మురిపవునవలా
నగుచిన్నెలు బిగిచన్నులు
జిగికన్నులు(నరసి మురిసి జిలజిలఁ బడియెన్).

ఉ. పెల్లుగ గండుతుమ్మెదల
పిండులు మ్రోసెను తూరిశారికల్
గొల్లనఁ గేక వేసె నల
కోయిలగుంపులుఁ గూసెఁ జల్లనై.
మెల్లన మందమారుతము
మీఁదికి డాసెను (మాటిమాటికిన్)
గొల్లలుగాఁ దపస్వి విరి
గోలల సేసెను మాయఁ డయ్యెడన్.

క. వెడవిలుతుం డప్పుడతుక
కుడియెడమల బెళకి చూచు కులుకుంజూపుల్
విడి సురియలు గాఁ గొని ముని
పడెఁ బొడుఁడని(యాన సైన్యపటలికినొసగెన్)

ఉ. క్రమ్ముల సొమ్మసిల్లి నృప
కుంజరమౌని యొకింత లోన ధై
ర్యమ్మున సేద దేరి విన
యంబున మ్రొక్కి నుతించు వేలుపుం
గొమ్మను జూచి యోకులుక
గుబ్బెత, యెవ్వరి దాన వీవు నీ
విమ్మెయి నన్ను నొంచుటకు
నేమికతం బెఱుఁగింపు మం చనన్).

గీ. కొప్పు చక్కంగ నొత్తి ముంగురులు దువ్వి
జాఱుపయ్యెద సవరించి జగ్గు మించి
మెఱుఁగుకమ్మలు తళుకుముంగరయుఁ గదల
మొలకచిఱునవ్వు గులుక నా (కలికి పలికె).

ఉ. ఓమునిరాజ చంద్ర జగ
దున్నతసన్నుతకీర్తిసాంద్ర యే

నే మని పేరు నేనె వచి
యింపుదు మేనక యందు రందఱుఁ
శ్రీమహనీయుఁ డైనసుర
శేఖరుకొల్వున నున్నభోగపుం
దామరసాక్షులం బిరుదు
దాల్చినదాన జగం బెఱుంగఁగన్.

సీ. నలువ దా నెక్కునందల మంపి పిలిపించి
వీణియ నాచేత విన్నమాట
హరుఁడు నే వినిపించుదురుపదానకు మెచ్చి
తొడమీఁదఁ గూర్చుండు మనినమాట
హరి పిల్చి నాచేత నభినయంబును జూచి
తనయొద్దఁ గొలువుండు మనినమాట
నారదపర్వతుల్ పోరి తన్ లయకోస
మ్మై తారతమ్యంబు లడుగుమాట
మున్ను వినియుందురే కదా నన్ను నేనె
పొగడుకో రాదు గాక యోపుణ్యమూర్తి,
యమరనాథుహజూరుపాత్రముల కెల్ల
గుండెలో గాల మనిపించుకొంటి నేను.

క. వెంబడి నాపయి మాత్స
ర్యంబులు పెరుఁగంగఁ గూడి రంభాదిసతుల్
తుంబురునిం బిలిపించిన
తంబుఱయును దాను నతిముదంబున వచ్చెన్.

ఉ. వచ్చిన నచ్చరల్ వడిగ
వానికి బోధన సేసి కొల్వునం
దెచ్చి ప్రతిష్ఠ గా నిడిన
దేవర, యేమని విన్నవించెదన్
ముచ్చట దీర రక్తిగాన
ముద్దులు గుల్కఁగ గోటివాద్య మే
యొచ్చెము లేకయుండ మఱి
యున్ మఱియున్ వినిపించె వింతగన్.

చ. ఘనమును రక్తియుం దొలఁకఁ
గాఁ దగుగీతములుం బ్రబంధముల్
మునుపుగ రాగముల్ పదము
లుంబయిమీాటు (అు)పొలంబుఁదెచ్చుచో
మనమున మెత్తుఁ గాని యొక
మాటను నేఁ దల యూఁచ నైతి వెం

టనె మఱి మాట మాట జగ
డంబు ఘటించెను నాకు వానికిన్.

క. నీ వెంతని నీ వెంతని
దేవేంద్రునిసముఖమందుఁ దీరనిపోరై
య్యా వేళఁ బులిమి పుచ్చక
నే వచ్చితి నాదువెంటనే తుంబురుఁడున్.

ఉ. ఇంటికి వచ్చి యొంటిఁ బడ
కింటను నన్నుఁ గవుంగిలించి నీ
వంటిరసజ్ఞురాలిని ది
వంబునఁ గాన నిఁకేల నన్ను నీ
బంటుగ నేలుకొ మ్మనుచుఁ
బైఁ బడె బైపయి నున్నదాన నై
యుంటను నేనునుం దగిలి
యుంటిని జంటగఁ గూడి వానితోన్.

క. గాయకుఁ డాటను రతులం
గాయకుఁడై మిగులఁ గళలు కరఁగించుచు నా
కాయం బెల్లను దనకడ
కాయంబుగఁ జేసికొనియె నది యేమందున్.

ఉ. వలపుల కేమి ముం దెఱుఁగు
వారికి నూరికిఁ గాక పోతి ర
చ్చలఁ బడి మేలువాఁ డనఁగఁ
జాలినకౌశికమౌనితోఁ గదుర్
బలుకనె సైఁచ దాయె నట
పల్లఁబు చూచి సహించ లేక పై
నలుగుచు మండి మండిపడి
యమ్ముని యూఁదక వాదు కిట్లనెన్.

ఉ. ఓసి దురాత్మురాల, తప
మూరకె బూడిదపాలు చేసి నీ
వాసము చేరి నిల్చి యొక
వాసికి వన్నెకుఁ గాక పోతి నీ
దోసము గాదు నీకుఁ గల
తుంబురుపొంగణఁగింప కున్న నీ
దోసమె కాక యం చలుక
తో నొకతోయముగాఁగఁ జూచుచున్.

గీ. నేఁడు మొదలుగ నెవ్వనితోడనైనఁ
బలికితేనియుఁ బ్రాణాన కలుగువాఁడఁ

గాక యొకఁడు వహించుకోఁ గలిగెనేని
యెన్ను మా బ్రహ్మ నైన నిట్టట్టు సేతు.

క. అనుమాటలు సవసవగా
విసెనో వినలేదొ యంత వీథులలోనన్
జన వెఱచి యెదుగసాగెన్
బనివడి తుంబురుఁడు దొంగబంటుం బోలెన్.

సీ. ముచ్చటకైనఁ దుంబురుఁడంచుఁ బేర్కొన్నఁ
గినుక నాఁటికిఁ బ్రాణమునకె తెగును
తంబుఱ గోటివాద్య మొకింత విను మన్న
నిల్లెల్ల బెదరంగ గల్లురు మను
నుబుసుపోకలకు నై యుస్సురు మన రాదు
దయ యంచు నాఁ డనర్థంబు సేయుఁ
బాటించి విరహంబు పదము పాడఁగ రాదు
తీవనిపోరు నల్ తిండి సేయు
గడియసేపిం ద్రుక్కొలువునఁ దడయ రాదు
చెట్టపట్టుక బాసలు సేయు మనును
కంటికిత వైనవారితోఁ గలయ కుండ
నొంటి మఱి కాఁపురానకు నుండవలసె.

గీ. పోటుబంటులు కోటానకోటు లోకటఁ
గ్రందుకొని సందడిలునాదుమందిరమునఁ.
బాముపలె వాని యెన్నఁడు పాదుకొనియె
నదిమొదల్ పోతుటీఁగయు మెదలదయ్యె.

మ. ఒకనాఁ డాబలభేదికొల్వునకుఁ దా
నొంటిం జనం ద్రోవఁ గా
చుక పొం చుండినతుంబురుండు స్వగా
సూచించినం జూచి యిం
చుకనే పూరక బెండుబొమ్మక్రియ న
చ్చో జబ్బుగా నిల్చి ని
ల్వక పై వ్రాలితిఁ గ్రాఁగి యున్నతనువె
ల్లం జల్లనై జుమ్మనన్.

ఉ. వాఁడును గాఁగిలించుకొని
వాడినమో మెద మోపి కొప్పునం
గూడఁగ ముంగురుల్ గొనబు
గోళ్ళను దువ్వుచు నామనం బిఁకం
జూడఁ గరంగు చున్న దను
చుం గరముం దనజొమ్ము సేర్చి మ

ల్లాడుచు నెంత చేసె ముని
హాయని నా కనియెం బ్రియంబుగన్.

ఉ. మేనక నిన్నుఁ బాసి యిఁక
మే నకటా నిలుపంగఁ జాలనన్
గ్గానక నీవు తాళ వటు
గాన కడున్ సొగ సైన వేడుకన్
మానక యుండకుండ నవ
మానకరుం డగుదుష్టమాని కో
పాన కడంగి నీపెదవి
పానకముం జవి చూపి తెంతయున్.

సీ. సత్యసంధుని హరిశ్చంద్రునంతటివాని
మాలను గొలిపించుమంతు గాఁడె
నారదమౌనియంతటివానిఁ జెలిచేసి
బిడ్డలఁ గనిపించు పెంకె గాఁడె
తనుఁ గన్నబ్రహ్మయంతటివాని సృష్టికిఁ
బ్రతిసృష్టి కల్పించుభ్రష్టు గాఁడె
యిదిగో యీయున్న దేవేంద్రునంతటివాని
దూఱు సేయ ఘటించుద్రోహి గాఁడె

ర్గాచపు ట్టను పేరుమాత్రంబ కాక
సమయమున దుష్టమాంసము సాగమెసవు-
నీవు విడిచిన వాఁడు నిన్ విడువఁ డింక
వానిపై నైన నుడువందు వాసవుండు.

క. నను వలసియున్న గాథే
యుని నేత్రము విడువ వలసి యున్నను నీకున్
వినిపింతు నొకయుపాయము
వనితా, కడ తొలఁగియుండ వలెఁ బదిపూటల్.

చ. తొడిబడి యెడ కేఁగినను
దోడనె వాఁడును రాక పోవఁ డా
య్యెడఁ జని యున్న నిన్ను వహి
యించుకొనం గలవానిఁ గాన మా
పుడమి భరించునశ్వపతి
పొంతకుఁ బొమ్మతఁ డైనఁ బ్బాని నిన్
విడువక వీఁకతో వెనుక
వేసుకొనం గలఁ డెంచి చూచినన్.

గీ. శాంతి నెప్పుడు బదరికాశ్రమమునందు
నుచితభక్తిఁ దపోవృత్తి నున్నవాఁడు



గరుణ గలవాఁడు సత్యంబు గలుగువాఁడు
పొ మ్మని వచింప నింటికిఁ బోవకపుడు.

చ. కట్టినకాసెతోఁ జిటులు
గంధముతో నరవాడుపూలతోఁ
బెట్టినసొమ్ముతోఁ జెమట
వెట్టినకస్తురిజాఱుబొట్టుతోఁ
బట్టినబోటితోఁ దొడుగు
పావలతో నొరుతోడఁ దెల్ప కే
నిట్టె బిరాన వచ్చితి నిఁ
కేకరణిం గరుణించి ప్రోచెదో.

క. శరణాగతరక్షామణి
బిరుదాంకా భామినీనవీనమృగాంకా
కరుణింపుము నాతహాతహ
మఱిచింపుము కినుక లేక మన్నింపు మొగీ.

క. విశ్వమున నీసమానము
విశ్వామిత్రుం డటంచు వినుతింతురు గా.
నశ్వపతినృపతి వర, మ
ద్రేశ్వర, ప్రాసాన కందు రేమొ కవీంద్రుల్.

చ. అని చిఱునవ్వు నవ్వి వని
తా, యిది యెంత ప్రయోజనంబు నిన్ .
గనుఁగొనఁ జూడఁగాఁ గలఁడె
కౌశికుఁ డింకఁ దలంపు మాను మే
యనువున నెన్నినాళ్లు మన
సైన సుఖంబుగ మావనంబునన్
గొనబున నుండు సొంపనుల
కున్ విడనాడ మరాళకుంతలా!

కం. ఇం దుండు మనెడుసందునఁ
జెందొవతూపులను రెండుచేతుల నిండన్
గ్రొంవలిరాకుజిరాదొర
ముందు వెనుకదోఁచకపుడు మునికళ గొసఁగన్.

చ. కలికి నెగాదిగన్ గని యిఁ
కం దపముం జప మంచు ఘారోదసం
బులు తలపెట్టినం మనసు
ముందటిరీతిఁ దదేకనిష్ఠ సై
నిలువదు తీరినప్పటికి
నేర్పుగలేన్ దప మోపినంతయున్

సలుపఁగ వచ్చు నీవనిత
నాఁటికి వచ్చునె ప్రాణ మిచ్చినన్.

చ. నెపమునఁ బూర్వజన్మమున
నేను ఘటించుతపఃఫలంబు గా
కిపు డొనర్రించునట్టితప
మింతటిభాగ్య మొసంగ నేర్చునే
తపమును సంధ్యయుం జపముఁ
దానము దానముఁ జేయు టెల్ల నీ
చపలమృగాక్షి లేబిగువు
చన్నులఁ గ్రొన్నెల నుంచనే కదా.

సీ. ఈకాంతచిగురుమో విసుమంత చవిగొన్న
నమరేంద్రుతోడఁ బోరాడ రాదె
ఈబోటిచుఱుకుచూ పేపాటిపాఱిన
నించువిల్తునిఁ గలహించ రాదె
ఈచానతేటపల్కే మైన దొరకిన
బ్రహ్మతోడను వాదువెట్టరాదె
యీలేమ పసిఁడిమే నెవ నూనఁ గల్గిన
హరికిఁ గోలారిక మంప రాదె

దీనిఁ బొసఁగించి బిగువుసందిట గదించి
కళలు గరఁగించి చొక్కించి గారవించి
మిగులఁ దేలించి లాలించి వగలుమించి
పంత మలరించువాఁడు సౌభాగ్యశాలి.

చ. అనువుగఁ బంచభక్ష్యపర
మాన్నము లుంచి భుజింపు మన్న నో
ల్లనియవివేకి యేజగము
లం గలఁడే తనపాలిదైవ మీ
వనితను జూపి యింకఁ దడ
వం బని లే దని కొంతతత్తఱం
బును దమకంబునుం బొడమ
మోహమునం జెలితోడ నిట్లనున్.

చ. చిలుకలకొల్కి, మా కొకవి
శేషము తోఁచెను నీవు తెల్పు ప
ల్కుల నల గాధిరాజుకొడు
కుం భ్రమియించినదాన వీవు నీ
జిలిబిలిమాటలుం బొలపుఁ
జిన్నెలు మమ్ము నేమి సేయునో

తెలియదు నేడు నన్నుఁ గడ
తేర్పుము నేర్చిన నేర కుండినన్.

క. మెప్పుగ నినుఁ గాపాడుట
కొప్పితిఁ బాపమును బుణ్యమున్నది నీచే
నిప్పుడు తుంబురు నీడకుఁ
దెప్పించు మటన్న మేము తేలేము సుమీ!

చ. అని యొకచిన్నిముద్దులయొ
యారపుజూదపుఁదేటనవ్వుతోఁ
గనుఁగొన మువ్వ ముంగరయుఁ
గమ్మ తళుక్కున మోముఁ ద్రిప్పి వ
చ్చినపని చూడఁగాఁ గడమ
చేసెద రార బళా యటంచు సి
గ్గున నడయాడుదానివలెఁ
గోమలి యవ్వల నివ్వలన్ నిలన్.

క. తిలకించి తపసి ముటిపెము
తిలకించిన నారువోయుటీరున మేనుం
బులకించిన నిలఁ జాలక
పలికించెద బోటి ననుచుఁ బదరుచు ననియెన్.

గీ. దాఁచ నేటికి బోఁటి, నిన్ఁ జూచినపుడె
యిదిగో చూడుము సాత్త్వికం బుదయమయ్యె
సుదతి, రాజస మింతగాఁ జూప వలెనె
యింత చేరియుఁ దామస మింత యేల ?

సీ. చెలియ, వాతేఱతేనె చిందిపో నంచున్నో
నో రూర నొకపల్కు నుడువ వేల ?
పొలఁతి, నీచూపుఁదూపులు దుయ్యునంచునో
సొగసుఁగ్రీగంటను జూడవేల ?
యింతి, చన్జక్కవ లెగసిపో నంచునో
నురమున నడ్డకే లుంచ వేల ?
తరుణి మారుని యేటు దాఁకు నటంచునో
నిలిచినచో నింత నిలువవేల ?

కాంత, జడుఁ డటంచునొ న న్నొకింత మైన
నించువిలుకానిరతిఁ గరుణించ వేల?
చామ, యిదిబై లటంచునో సైగఁ గాఁగఁ
గపురపుటనంటిచాటు కేఁగంగ నేల?

క. కాకమదిలోనికోరిక
మాకుం దెలుపంగఁ గలది మఱి యే మైనా

యేకాంత మొకటి గలదో
లోకస్తని దెలుపు మనుచు గొబ్బున లేవన్.

చ. కదలిక చూచి నాతలంచు
కార్యము దార ఫలించె నంచు నా
మదగజయానా లేనగవు
మాటికి మోమునం దేట లీనం దా
నెదురుగం జేరి మీర లిది
యేమి తలంచితి రింతకంటె నా
మది గల దైన నే వెఱతు
మానులతోడుతం బొందు సేయంగన్.

చ. నునుమును పెందు లేనిప్రియ
ముల్ సవరించి యొకింత లోంగినన్
వెనుక దిశించి చూడ రవ
నిన్ మగవారల నమ్మరాదు నా
మనమున నంతగా వలయు
మాటలు గల్గిన నేటిమాత్ర మా.
ననవిలు కానికేళికల
నన్ మెఱయించెద నంచు సిగ్గునన్.

చ. కులుకుచు మోము వాంచు నది
కోపము చేసెదవే యటంచు మై
పులకలు పోవఁగాఁ జుబుక
ముం గొనగోళ్ళను సోఁక నొత్తి చె
క్కులు కబళించి ముద్దు గొనఁ
గొంకుచు నల్దెసఁ జూచి యంతటన్
నిలువునఁ గౌగిలించుకొన
నిల్వక యమ్మునిరాజు వేడుకన్.

ఉ. పాయనికౌఁగిటన్ రవిక
పక్కన విచ్చినఁ జన్నుదోయి కే
ల్దోయిఁ గదించి చొక్కి యటు
తోఁచక తూఁగెను మోహవార్ధి నా
చాయ మునుంగ కుండిన వె
సఁ దరిఁ జేరనుపాయ ముంచ్చి నం
దీయనికుండ లానుకొని
యీఁదుచు తేలుచు నున్నపోలికన్.

ఉ. అంతట తాళలేక యొక
యందపు లేఁబొదరింటిలోని కా

యింతిని సమ్మతించుకొని
 యేఁగి ముదంబున రాజయోగి యే
కాంతము గాఁగఁ గ్రొంజిగురు
 టాకుమిటారపుశయ్యమీఁద న
త్యంతవినోదవైఖరుల
 నందుచు నిండిన వేడ్కఁ జెందుచున్.

సీ. సుదతి బాగాలీయఁ జొక్కు పుట్టు నటంచు
 విడువక పుక్కిటివిడెము వేఁడుఁ
గలికి ముద్దు లొసంగఁ గాక తీఱదటంచుఁ
 గమ్మవాతెఱపానకంబు వేఁడుఁ
గొమ్మ లేఁజనుదోయి ఱొమ్మునఁ గదియింప
 మనసు నాటఁగఁ గ్రుమ్ము మనుచు వేఁడు
బాల కేళికిఁ దన్నుఁ బ్రార్థింప మఱచిపో
 యితి నంచుఁ బుంభావరతికి వేఁడు
సువిద చెవిలోనఁ గవకివకవలు గొణఁగ
నతివ, యిది మాకు నేర్పు మటంచు వేఁడు
మగువ కళ లంటఁ గరఁచి యేమరలు సేయ
నబల, యిది యేమి చేసితి వంచు వేఁడు.

క. ఈలీలఁ జిగురువిల్తుని
కేళిం బెనఁగొనుచుఁ గెరలి కిలకిల నగుచున్
సోలుచు శృంగారాంబుధిఁ
దేలుచు రమియించి తనివి తీరక యంతన్.

సీ. పఱువనిపఱపుగాఁ బఱచినవిరుళ్ళచేఁ
బెనుపైనపొగడసంపెఁగలనీడ
నేడాకనంటుల కిద్దరద్దరి మోయు
పువుఁదేనెవాఁక చేరువలచాయ
మల్లెతీవల నల్లిబిల్లిగా నల్లిక
యింపైన లేఁబొదరిండ్లలోనఁ
జలువ తెమ్మెర నించుకలువపుప్పొళ్ళచే
నీ కైనయిసుకతిన్నియలచెంత
నాడ నీడను వేడుకఁ గూడిమాడి
యచట నిచటను దమింశోడ ననఁగి కొనఁగి
నక్కడిక్కడ మల్లాడి యలసిసొలసి
ఘుదియ వైకుంఠ మై యుండె నంతలోన.

మ. నునుపుంజెక్కులఁ గ్రమ్ము లేఁజెమటబిం
దుల్ జార్చి గోటం జిటు

ఠక్కనఁ బో మీఁటుచు జాఱుపయ్యెదచెఱం
    గుల్ చక్కఁగా నొక్కి చె
క్కిన ముంగుచ్చెలకొంగు దీసి దగతోఁ
    గెంగేలఁ గీలించి మో
హనచందంబున నొక్కబోటి యటకై
    యేతెంచె శీఘ్రంబుగన్.

గీ. భ్రమసినటు లున్న మేనకాపద్మముఖికి
మ్రొక్కి నవ్వుచుఁ గొప్పులోఁ జెక్కుకొన్న
కాకిత మొసంగ శిరమునఁ గదియఁ జేర్చి
యంత గోట లకోట యొకింత విచ్చి.

క. వేయుంగన్నుల వేలుపు
సేయఃసిఖా చూచి ముద్దుచేతులచే నా
రా యిది దేవశిఖామణి
చేయుసిఖా యనుచు మెప్పు సేయుచుఁ జదివెన్.

సీ. శ్రీమన్మహాదేవసింహాసనాధ్యక్ష
    చతుస్సహస్రకటాక్షజాల
వీక్షణాలంకార దక్ష రాక్షసశిక్ష
    ణ భువనత్రయరక్షణప్రభావ

వైభవనిధి యైనవాసవుండు బిరుదు
పాత్ర నీమేనకపాలి కనుపు
పరమాణు విది నిన్న బ్రహ్మ విశ్వామిత్రు
నాడకుఁ బిలిపించి యతనిమీఁద

ముట్టినపిరాదుచేఁ దనముదల లేక
నాకమున కేఁగవలవ దన్నాఁడు గనుక
జులబులిఁకఁగూడ దీలే(రోఖా)ఖ చూచినపుడు
వడిగ మాపాద మాన రావలయు నీవు.

క. అని మెల్లఁగఁ జదువఁగఁ జ
ల్లనఁ దనడెందంబుఁ గలఁగ నమ్ముని ధరఁ దె
ప్పన వ్రాలె మొగలిజంబువ
గొని వెనుకై మరుఁడు కూలఁ గ్రుమ్మె ననంగన్.

ఉ. వ్రాలిన నవ్వి మంచిదయ
వాఁడవు నేఁ డపురౌర వింత నీ
పాలనె కల్గె నీసుఖము
పాటిది కాదొకో మహాసుఖంబు నా
మేలి మొకింత యైన మది
మెచ్చవు నే నిలు సేరఁ గల్గుటే

చాలు శటంచు నెంచవు వి
చారము సేయుదు రయ్యా, యిర్యోడర్.

చ. అడలకు మింక నీవలసి
నప్పుడు ప్రేలెడుచీటి పంపిన
దడఁయక వచ్చెదర్ నిజము
నమ్ముము నెమ్మది నంచుఁ జేరి తా
నడుగులమీఁద వ్రాలి విన
యమ్మున నిల్చినఁ గొంతసేపు తొ
క్కుడుఁబడి నవ్వుతో నొకవ
గం దలఁ యూఁప నదే నెపంబుగన్.

గీ. మరలి ముసిముసినవ్వుతో మరుఁడు దాను
నొకవిమానముపై నెక్కి యున్నవారిఁ
గూర్చుకొని వాసవునినిండుకొలువు కేఁగి
యంతయును దెల్పి బిరు దందె నచట మేన.

క. ఇచ్చటను రాజమునివరుఁ
డచ్చటఁ బో నిలువ లేక యది చేసినయ్యా
తచ్చనలకు మచ్చికలకు
ముచ్చటలకు నదిమెలోకముగఁ బరవశుఁడై.

సీ. తాన మాడుటె కాని మానె సంకల్పంబు
నీళ్ళు చల్లుటె కాని నిలిపె సంధ్య
వ్రే లెన్నుటే కాని విడువుచేసె జపంబు
తడవు మ్రొక్కుటె కాని విడిచె భక్తి
ముక్కు పట్టుటె కాని గ్ర(డ)క్కె నోంకారంబు
మౌన మొందుటె కాని మఱచెఁ దెల్వి
కన్ను మూయుటె కాని కనఁడు లో లక్ష్యంబు
ధ్యానించుటే కాని యాఁచెఁ దపము

కోర విన సోఁకఁ గన రుచిగొనను మూరు
కొనను మానియు మేన పల్కులును మేను
రూపు వాతెఱ మైతావి దోఁప మనము
చెవియొడలుకన్నుజిహ్వానాసికయుమఱచు.

క. కొంచించి నిలుప మన సా
పంచేంద్రియములనుగూడి బయలైదుముకఁ
మించినచలమున మదిగుది
యించెఁ వశవర్తిగాఁగ నింద్రియములతోఁ.

చ. చెదరక తొల్త నొక్కటిగఁ
జెల్వపయిఁ మది వాలఁగాఁ జమీ

యది యిటు త్రిప్పినేర్పన ని
జాంతరలక్ష్యము నందుఁ గూర్చి యా
పాదలికచేత వాయువులఁ
బూరక రేచక కుంభ కంబులం
గదలిచి కుండలిన్ బ్రాడవు
*గా నిగిడించి తదేకనిష్ఠమై.

క. పొందుగ షోడశపద్మము
నందు మదిం దగులువఱిచి యానందముతో
నందుంచినసావిత్రిని
జెందుచుఁగొన్నేండ్లు తపముసేయుచునుండెన్.

సీ. నిక్కి యించుక మేను నిగిడించి నిలుచుచోఁ
బటపట బ్రహ్మాండభాండ మగలుఁ
గుంభకంబున నొడల్ కొంత యుబ్బించుచోఁ
గుటకట దిక్కులు పెటిలి పడును
పట్టఁ జాలనిచూపు లట్టిట్టు పఱచుచోఁ
జిటచిట నడ వెల్లఁ జమిడు మండుఁ
బట్టి విడ్చుచు నట్టె నిట్టూర్పు పుచ్చుచోఁ
గిటగిటఁ గొండలు గిఱ్ఱఁ దిరుగు

నట్టిఘోరంపుఁదపము నాపుట్టుమొదలు
గట్టిగాఁ జూచియును గాన నెట్టియెడల
నిట్టియెడ నేను బోవ కున్నట్టులైనఁ
బుట్టు వింత యటంచుఁ దా నట్టె యపుడు.

మ. ఒరపుం దెల్లనిముత్తెపుఁగాసరులతో
నొయ్యారపుంజూపుతోఁ
గరఖట్వాంగగదాత్రిశూలమణిభ
క్కాఖడ్గగుచ్ఛాళితో
విరులం జెల్వగుకొప్పుతో హిమము తీ
వింగెల్వ నోవల్వతో
సరి మధ్యాహ్నమువేళ రాజమునికిన్
సావిత్రి ప్రత్యక్షమై.

క. నిలిచిన లోపలిచూపును
వెలిచూపౌక లైవఁ జూచి వేడుకఁ దడుచుంగా
జెలఁగుచు మ్రొక్కిన లె మ్మని
పలుమఱు దీవించి దేవి పలికెం గరుణన్.

గీ. తపము చేసితి వింత సంతానకాంక్ష
బ్రహ్మ వ్రాసినవ్రాఁత తప్పంగఁ జేయ

నొకరివశ మౌనె యెంతైన నోనృపాల,
కన్య నే నిత్తు నావంటిధన్య నొకతె.

క. శతపుత్రలాభ మబ్బెను
సుతఁగరుణనుగొనుముగొ సరఁజూడకుమిఁక నా
సతి కిడుము నాదుపేరని
యతిముదమునఁ జనియె నంత నంతర్హితుఁడై.

ఉ. లేచి తపంబు నేఁ డిదె ఫ
లించె నటంచును మద్రరాజు రా
జోచితభూషణంబు లెద
నూని యనూనవిభూతిభాసితుం
డై చతురంతయానమున
నచ్చతురంగబలంబు గొల్వ లీ
లాచతురాంగనాకలిత
రాజవిరాజిత మౌపురంబొగిన్.

వ. ప్రవేశించి యంత మాళవంతుండు తెచ్చినయ
చ్చపుముత్యంపుజంపులం గనుపట్టినపట్టంపు టే
నుంగుపై నెక్కి సొం పెక్కి యుభయపా
ర్శ్వంబుల వింజామరంబులు వీవ ముందర

వందిమాగధజనంబులు కైవారంబులు సేయ
నంచలంచలఁబంచమహావాద్యంబులు సెలంగ
నుచితవాహనంబుల బంధువర్గంబులు రా
రాజమార్గంబులం జని చని నిగనిగనిజాతిమ
గరాతి చెక్కడపుచొక్కంపు కెంపుకంబంబుల
నిద్దంపుమిద్దెల నబ్బురంబులగు నుబ్బుచప్పరం
బులం దళతళలీనుదంతంపుబొమ్మలచెంతలవింత
వగల తొగలతెగలరాజగతులం బఱచి
నబురుసాతివాసుల నిరుగెడల మెఱయుమిటా
రంపుసూర్యపుటంపు బలుదిండ్లునింపుతలగడల
నొఱుంగు మెఱుంగుఁబోఁడులు వీణెలు కడ
నిడి వెడవిలుతుండు తెగ నిండం దిగిచి విడి
చినయురచందురువాతి పసిండిములుకులజగ్గుస
దిగ్గనం గులుకు మేనులుం గలికి నెన్నుదురులుం
దళుకుదళుక్కనఁ బిఱబిఱ సోరణగండ్లపజ్జ
లం జేరి కలువతోరణంబుల వెంటం జంటతో
రణంబులుగాఁ జూచు వారిచూపుల కెదురు
కోలు పంపినపెంపున గుంపులకు నిగిడి
చూచుచు, నిచ్చ నిచ్చలు మెచ్చులు సెచ్చు

హెచ్చు పచ్చరాగచ్చుల నిచ్చలంపుబచ్చి
పచ్చికల తచ్చులాడుగోడల నాడనాడ ప్రీడ
లతో జలక్రీడ లాడు గొల్లకాపుప్రోడచేడి
యలు విడిచినమడుంగులు దొంగిలి చన్న
పొన్నతుదనున్న వెన్నునిచిన్నెలం బిత్తరిల్లు
చిత్తరువుల గ్రొత్తగ్రొత్తగా నర్తించిన ననలగు
త్తుల నుత్తిల్లి యల్లనల్లన నల్లిబిల్లిగా నుల్ల
సిల్లి తేఁటిపిల్లలపెల్లురవంబులకు వియ్యంబు
లగుశ్రుతులం బొలుచు దంబుజులనాదంబుల
కొద్దిక లగుమద్దెలల సద్దులన ద్దణంచి ముద్దులు
గులుక నజ్జగజ్జియలనినాదంబుల వినోదం
బులు మోదంబు లాపాదింప మించునబ్బు
రంపు సిబ్బెంపుగబ్బిగుబ్బెత లుబ్బున నాటక
శాలల్లు వెడలి యలరువిలుతుండు కాలి
గోలుసులక్ష దెప్పునం దప్పించి విడిచిన
కొమ్ముగత్తులం గలమదము నేనుంగుల తెలం
గునం గట్టినచనుకట్టులం బిగువుఁ బుట్టించుక
నొకరి కొకరు మునుకొనినడవం దడఁబడి
యడుగుల నడనడల జీరాడుగజ్జియల చేరు

లతోఁ నీలంపురవలజాళువాఁ బోలుతేలుపుల
కెలంకుల నిలిచి తొంగి చూచి సిగ్గు సిగ్గునఁగా
గిఱుక్కన మళ్ళిన నవ్వాకిళ్లవే గుంచిన
బాగున మనం బించుకించుక నిలుపుచు, జంట
జంట లై యొండొంటికంటె మిన్నంటి నిగిడి
యుండుపసిండికుండలనొప్పు లుప్పతిల్లుకొప్ప
కప్పురాయుప్పరిగలతోఁగరుచిగురుల మిగుల
నగువగువగలఁ బగడపుజిగిమెఱుఁగులఁ బర
గు తెరచవికల మరకతపుతిరుగుతరుగుల సొగ
టాలాడుమెఱుంగుబోఁడు లేను గెలిచితి నేను
గెలిచితి నని గ్రక్కుగ్రక్కునం బక్కురాఁచా
క్కడంపుమెట్ల నేట్లు పడం బడిబడిఁ దిగుచు
మెచ్చు దెచ్చుకొన్న మేనకమీఁది మచ్చరం
బునం గ్రచ్చుఱ నచ్చటఁదిగి వచ్చినయచ్చ
రముచ్చకంటులచొప్పునం దప్పక చూచు
తెప్పవిప్పుగొప్పకన్నులుం దప్పు లేనియొప్పు
లుం గలిగి గుప్పుగుప్పున నిలువ మెప్పులు
గొనుచు, నక్కడివలెఁ జిక్కుపడసనునిక్కునం
దల యూఁచుచు, గుజ్జులేమావిజొంపంబులం

బింపిళ్ళు గూయు చిలుకగుంపుల పెంగూఁతలన్
జెంగావుల సింగారించినబంగారపుంగురుంజుల
కౌమరుప్రాయంపు సిబ్బెంపుగబ్బిగుబ్బల బిబ్బో
కవతులు తళతళలు కులుకు జిలుగుఁబయ్యెద
లం బొగరుఁజనుగవ లుబుక బిగియించి యిం
చుకౌ జాఱిన యరవిరివిరవాజివిరులసరుల
మరలఁ గ్రుమ్ముడులం దుఱుముకొని మిసిమివిస
రుపసిండిగాజుల నెగంద్రోచుకొని కమ్మి చిమ్మ
నఁగ్రోవులం జిమ్ముకమ్మనిపన్నీటిజాలును బిసబిస
విసరి యొసఁగుగుబగుబవచ్చునగరుధూపధూ
మంబులన్ బటికంపుఁబుటికల నించి చల్లు తెల్ల
నిమ్మల్లెమొల్లవిరులందా నవింపునభిషేకజలం
బులుంగట్టినపట్టంబును వేయువింజామరంబులు
గాఁగైకొని నగుచు, మెల్లమెల్లన సునంగ
మొగసాలఁ గడచి మరకతమాణిక్యచాకచక్య
సహవాసనహకారదళపల్లవతోరణరంభాస్తం
భవిజృంభమాణ వినోదకాంచనసింహాసనం
బగురత్నసింహాసనంబునం గొలువై కూర్చుం
డికొంతవడికిం గొలువు డిఱి మజ్జనభోజనంబు

లంగీకరించి మంచి జీవదంతంపుఁగీలుబొమ్మ
చెక్కడపు జిగిబిగి పగడంపుఁగంబంపుఁ జాదు
బోదియలనీడల వైడూర్యంపు మేలిదూలపు
సోగపుష్యరాగ దంతెల సూటికికిటపచ్చరా
రావిరేకపసిండితాళుల నిల్దువుటద్దంపుఁగెం
పుగూండ్ల రంజిల్లుచుట్టుబవంతి ముత్తెంపు
జల్లులంబిక్కటిల్లుపడకయిల్లుఁజేరిహంసతూలి
కాతల్పంబునం బవ్వళించి మాళవితోఁ దాను
దపంబు సేయుట మొదలుగా వరం బొసం
గుట తుదగా నంతయుం దెలుపుచు మదన
కేళీవినోదంబులం బ్రొద్దులు గడపుచుండ నంత
సావిత్రీవరప్రభావంబున సమారూఢగర్భ
యగు నభ్భామినీమణిం గనుంగొని మనంబు
నం బొంగుచు నారాజపుంగవుండు.

సీ. ముట్టరా దని లక్కముద్ర లుంచినరీతి
నాతి, నీచన్నులు నల్లనయ్యె
గోరంట కుండఁ గంబూర గుప్పినపోల్కిఁ
గలికి, నీచెక్కులు వెల్లకఁబాఱె

బిడికి లించక యుండఁ బెంపు చేసినదారి
నారి, నీలేఁగాను మీఁటి బలిసె
నొక్కింత వేగింప నొల్లనిచందానఁ
జాన, నీకును నిద్ర చాలఁ బొడమె
నొక్కట రతికూజితంబుల నుగ్గడింప
నోప ననులీల బాల, నిట్టూర్పు లొదవె
నీకు నలకేళిపైఁ బాళిలేకయున్న
నతివ, ముచ్చట గా మాట లాడరాదె.

క. అన విని పతిచతురోక్తుల
కును వనితామణియు నగుచుఁ గూరిమివలనన్
బెనఁగొను తమిచేఁ బైఁ బడె
ననవిలుతుఁడు మొగలిపెట్టునం బైఁద్రోయన్

సీ. మల్లాడి ప్రాల్మాలి చల్లనియల్లికా
డలిఁ బోలుకేలు మూపులకుఁ దాఁచు
కసి దీర మన సారఁ గౌఁగి లబ్బక యున్నఁ
జెలువునిపై బోరగిలుచు వ్రాలు
నరుచి దీఱంగ వాతెఱ యాని యాఁ రార
చవు లంచు వెడ వెడ చప్పరించు

మణితముల్ సెవి నించు మంటి తావులు గ్రమ్మ
నుస్సురు మనుచు నిట్టూర్పు లూర్చు
నొడఁబడిక లిచ్చుఁ దడఁబడి మడుపు లిచ్చు
ముద్దులకుఁ జొచ్చు సుద్దులఁ బ్రొద్దు పుచ్చు
రతికిఁ జొరఁజూచు నోపక పతిని జూచు
నాత్తగర్భావరోధ యై యావధూటి.

చ. కలసి రమింప లేనిమతి
కక్కుఱితిం బెనఁగొంచు నీగతిఁ
మెలఁతుక కొన్నిప్రొద్దులు క్ర
మింపఁగ నంతట నంత నంత ప్రొ
ద్దుల నెల యైన మాళవికిఁ
దోయజగర్భునిదేవిసత్కృపం
గలిగెఁ గుమారికామణి యొ
కానొకమంచిదినంబునం దొగిన్.

ఉ. పుత్త్రిక గల్గె నంచుఁ బుపు
బోఁడులు దెల్పఁగ మద్రరాజు లో
కత్రయ మేలినట్లు కుతు
కంబునఁ గోరినవస్తుకోటి స

ర్వాత్రి యొసంగి దేవికృప
వల్ల జనించుట నామెపేరె సా
విత్రి యటంచుఁ జేరిడి భు
విఁ బెరుఁగఁ బెంపొందె బాలయున్.

ఉ. బోటులతోడఁ దోయముల
బొమ్మలపెండ్లియుఁ బుట్టచేండ్లుఁ గో
లాటము* నమనము లరు
గాటలు గుజ్జనగూండ్లుఁ దాటిచె
ట్లాటలు నిద్దఱాండ్లమగ
నాటలు వెన్నెలగుప్ప డాఁగిమూఁ
తాటలు నాదిగాఁ గలుగు
నాటల నాడుచు నుండె వేడుకన్.

క. ముద్దించి తల్లిదండ్రులు
విద్దెలు నేర్పింప సకలవిద్యలు వచ్చెన్
ముద్దియకుఁ బచ్చవిలుకాఁ
డద్దిర యన మెచ్చ వచ్చె యౌవనమంతన్.

సీ. పున్నమనాఁటి సంపూర్ణచంద్రునిరీతి
కళలు దేరఁగ సొగఁ గలికిమోము

---

* చెమ్మచెక్క.

మెఱుఁగువెట్టినమించుమించుటద్దముమాడ్కి
నీడ వాఱఁగ సాగె నెలఁతచెక్కు
చికిలి సేసిన మారుచేలకోరులపోల్కిఁ
జాయ లూరఁగ సాగె సకియచూపు
పటిక నార్చిన గొప్ప పసిఁడికుండలభాతి
వన్నె మీఱఁగ సాగె వనితచన్ను
లారు పొడచూపె నడ మందమయ్యెఁగురులు
కొప్పునకుఁ గూడెఁ గటిసీమ కుదురుకొనియె
నడుము కృశ మాటదక్క నప్పడఁతి నిండు
ప్రాయమున సకలాంగసంపదలు గాంచె.

క. ఏణాక్షి తండ్రి పనుపునఁ
బ్రాణసఖులతోడఁ గూడి పర్వతుచేతన్
వీణానాదము నేర్చి ప్ర
వీణ యనం బొగడు గాంచి వేడుకనుండెన్.

---

## ద్వితీయాశ్వాసము.

---

అవధరింపుము పాండవేయాగ్రజునకు
ఋషివరుండు మార్కండేయుఁ డిట్టు లనియె
నటులు సావిత్రి సకలవిద్యలు గ్రహించి
తగినకాంతుని వరియింపఁ దలఁచు చుండ.

క. ఒకనాఁ డనుఁగుంజెలు లా
ముకురాననతోడ నందముగను వసంతం
బొకటఁ దగఁ గేలికావని
నకలంకం బగుచు నీమయావసముక్రియన్.

మ. పొలు పొందంజనుగుత్తులం దనరునో
ప్పన్ ప్రోవి నందంద తే
నెలు చిందన్ గలకంఠరావముల నెం
తే వింతగాఁ బర్వ్వా నిం
పొలయన్ నెమ్మి నటింప నైన నొకచో
యుక్తంబు గా దింతకున్
ఫల మ్మై యుండదె బోటి యాయినకర
స్పర్శంబు తాఁ గల్గినన్.

చ. అనుచు ననంగ నంగనల
యాచతురోక్తుల కెందు లేని సి
గ్గున మఱుమాట లేక చెలి
కొండొకసేపున కమ్మలార, గ్రు
క్కునఁ జని పూలుఁ గోసుకొని
కూడి కొలంకుల జల్లు లాడి యా
వనిఁ గలవింతఁ జూచి మఱి
వత్తుము వచ్చెదరే యటం చొగిన్.

మ. తళుకుంబావలుఁ ద్రొక్కి యొక్కసఖికై
దండన్ జెలుల్ గూడ వే
డ్కలతో నేఁగె లవంగలుంగబదరీ
ఖర్జూరజంబీరవం
జులమందారరసాలసాలకదళీ
చూతక్షమాజాతభా
గిలిసంగీతభరాభిరామ మగున
య్యారామమున్ జూచుచున్.

క. బోటులుఁ దానును బువ్వుల
తోఁటననలఁ జిదుము ముదముతో నేమేమో

పాటలు వాడుచుఁ బూవులు
గోటఁ గిఁటుచును దూటిగోయుచు మఱియున్.

సీ. ఏలయేలతమాల బాలరసాలసా
లముకొమ్మ కొమ్మ ఫలమ్ము లమ్ము
మేలు మేలును మేలు మేలు సునాసనా
సిరి నంటి నంటకు సారె సారె
చాలుఁ జాలును నేల నేలఁగ నల్ల న
ల్లది దాని దీనిని నమ్మ నమ్మ
గోల గోలతనాల చాల నాలమునబ
న్నము రాఁగ రాఁగదే నవ్వ నవ్వ
చెలువ చెలువమ్యో బల్ పల్కు చిలుక చిలుక
వెలఁది వెలఁది నీకేఁగేల నలరునలరు
నెలఁత నెలతమ్ములే లేయొరులవిరు లవి
చెలియ చెలి యమ్యోనే నెమ్మితలముతలము.

మ. అని నానాగతిఁ బల్కుచున్ విరుల నం
దం దంది నే ముందుముం
దని రాగిల్లుచుఁ గేల గిల్లుచును బా
గాఁతీగె లుయ్యాలచె లువ్వనఁ దా

రూఁగుచు డాఁగుచున్ బొదలఁ బు
వ్వుం దేనియల్ గ్రోలుచున్
దనియం దేలుచు సోలుచున్ నగుచుఁ గాం
తల్ కాంతలై వింతఁగన్.

మ. నను పుష్పా ళ్లొడలన్ దుమార మెగయన్
ముంగేల కంఠంబులన్
ననదండల్ మెఱయన్ గొలంకుదరిచెం
తన్ రంతులన్ జేరి రాఁ
గనుఁవిల్కాఁ డనుఁవీరునిం గొలిచి వే
డ్కన్ సాహుసే బాహుసే
యనుచున్ బూవుల బూదిపూఁత తగ నీ
రాడంగఁ బోవున్ వగన్.

చ. లలితసరోజరాజిని దొ
లంకుకొలంకు కెలంకులందు సొ,
మ్ములు సడలించి పావడలు
ముద్దుగఁ దాల్చి లతాంగు లొండొరుల్
పిలుచుచు నీరు సొచ్చిరి త
మిం దమమోములు చన్నులున్ భుజం

బులుఁ గను లల్లతామరస
　　మూలముమాదిరి చూడనుం బలెక్.

యమక రగడ.

కంటిలోను బడఁగా జల మూనకు
గంటిలోను బడఁగాఁ జల మూనకు
విరటు వేయక దానికి వెంట న
వ్వింట వేయక దానికి
సీఁతనీళ్ళు చొరనీవె బాల
యీఁత నీళ్ళు చొరనీవె బాల
కలికితామరల గైకొనకొల్లవు
కలికి తామరలఁ గైకొన కొల్లవు
నిలు వింతె లేనెర మ్మనరా
నిలు వింతె లేనె రమ్మన రా
సరి తా విచ్చెను జల్లఁగ నాయమ
సరి తా విచ్చెను జల్లఁగ నాయమ
వడి గలపద్దిని వాఁదిని ముంచితి
దా..............................
..............................
ముద్దియ వేలను ముం దగు నాతో

పో విడనాడకు పోకలు వలదే
తావుల నీ రటు తనరఁగ డాయన్.

చ. అని విరిబోఁడు లొండొరుల
నాడినమాటలె మళ్ల నాడుకొం
చును జలకేళి చాలు నను
చున్ గనుదమ్ములఁ గెంపు చేఱ నో
య్యనఁ జనుదోయిపై కరము
లానుక వెల్వడి చల్వపావడల్
మినుకుదుకూలముల్ తళుకు
మేలిమిసొమ్ములు దాల్చు చుండఁగన్.

గీ. చెంత నొకగుజ్జులేమావిచిగురుఁగొమ్మ
నొక్కరాచిల్క ముక్కున నొక్కజపస
రంబు కఱచుక యుండ నారాకుమారి
కని పడంతుల నిలుఁడని కదియఁ జేరి.

ఉ. పట్టఁగఁ బోవుచో నవలి
పార్శ్వమునన్ బులిదిండు దిండుగాఁ
జుట్టిన కెంజడల్ సలిల
శోభితమండలు మొగపట్టిచే

దిట్టపువీణ బూదిమెయి
తెల్లనికుంచెయుఁ గక్షపాల కు
రట్టపుపావలుం గలుగు
మౌనిశిఖామణిఁ జూచి నవ్వుచున్.

క. ఇతనిది కావలె జపసర
మితఁ డెవ్వఁడొ దొడ్డతపసి యితఁ డీవీణన్
జతురుఁడు గావలెఁ గల్పన
జతచూతుమటంచుఁజిలుకఁజయ్యనఁగొంచున్

చ. తనుఁ గని మాది మాది యని
తాపసవర్యునిదండఁ జేరి కాం
త నిలిచి దండ మీజపము
దండవు మీది గదండి (డ)కొండు కొం
డనఁ గొని నీకు మెచ్చు గల
దండజయానరొ, యేమరించి దీ
నినిఁ గొని వచ్చె నీచిలుక
నేరెడుపం డ్లనియేమొ భ్రాంతిగన్

మ. అతిమోదంబు ఘటిల్లె మామదికి స్ని
హావాప్తి నీ కొను గా

వృత మంచుఁ బచియించి వీణ దెస నీ
వుఁ సారె చూచేవు నే
ర్చితివో యించుక దీనిపోఁడిమియుఁ జూ
చే యంద మాచంద మా
నతివా, కాక రయొకింత కన్నుగులు తే
మైనఁ మదిం దోఁచెనో!

గీ. అని మునీంద్రుండు వలుక నయ్యాబల మ్రొక్కి
దేవ, మా నేరుపుల కేమి దీని మును పె
పర్వతునిచేత నుండఁగాఁ బలుకు మెచ్చి
ప్రీతి నే వేఁడ నారదు చేతి దనియె.

క. అనినఁ దన చేతివీణియ
నొనరఁగ నీచేత నేట కుంచెను బుడమిఁ
బనివడి యతఁడు మెలంగఁగఁ
బని యే మన నన్నుఁ జూచి పర్వతుఁడనియెఁ.

శా. నాకుఁ నారదమౌనికిఁ మిగులఁ బ్రా
ణస్నేహ మాసాల్వధా
త్రీకాంతాత్మజుఁ డాకుమారకుని ద
ర్శింపంగ వా రేఁగ నం

దారిన్ నేనును బోయి మే మెదురు వీ
ణల్ పూని వాయించుచో
నేకీభావముచేత మారువడిపో
యెన్ వీణ లానాఁ డనెన్.

ఉ. కావున నాఁటివీణవలెఁ
గానఁబడెన్ మునినాథ చూడు మీ
భావము నారదుం డనుచుఁ
బాటెడుబుద్ధి కనంగ నంగనా,
నీ వనుమాట లన్నియును
నిక్కము చొక్కపునీదువాక్యపుం
గ్రోవ గణింప నశ్వపతి
కూఁతురునుంబలెఁ దోఁచె మామదిన్.

క. ఎన్నం దుల లేదని నీ
కన్నందులకున్ మనోహరా కార మహా
విన్నందులకున్ గన్నులఁ
గన్నందులకున్ మనంబు కడుముద మందెన్.

ఉ. వింతగ సత్యవంతుఁ డల
వీణకు బ్రహ్మయటంచు నెంతుమీ

వింతగ మించి నేర్చితివి

ఏమి సరస్వతివే తలంపునం

గొంత వినంగఁ జేయవలెఁ

గోమలి నీవగ నంచుఁ బల్కి యా

చెంతను గూరుచుండి తన

చేతివిపంచి యొసంగ వేడుకన్.

మ. తమి కేలం గొని మున్నునుద్గ్రహమువిరాఁ

దన్ స్థాయి సంచారముల్

గ్రమ మొప్పన్ స్ఫురితంబు కంపితము డాల్

గ్రామంబులున్ మూర్ఛ లం

దముగా నౌడవషాడవంబులు తగన్

రాగాదిగీతప్రబం

ధము లింపొందఁగ గాత్రమందొదుగ నం

తన్ వీణ వాయించినన్.

ఉ. మేలు లతాంగి, చాలు నిను

మెచ్చఁగ వచ్చును సత్యవంతుఁ డీ

మేళము గూర్చి పర్వతుని

మేలిమి చూడఁగఁ జూపఁ బంపె మున్

వేళ లెతింగి తీ వప్పుర
నీమది వానిమనంబు నొక్క_ లై
పోలిక యీన్నృపాలునకుఁ
బొల్పుగ నీవగ్గ తెల్పఁగావలెన్.

క. ఒక్కప లైక్క_నను మే మత
నికి నాతఁడు మాకు దాఁచ నేర మబల, మే
మొకగురువుల మనియును వాఁ
డొకశిష్యుఁడనియుఁ నుఁ లేకయుందుము చెలిమిన్.

మ. అదిగో పర్వతుచేత నిన్ను వినినాఁ
డానాఁడు నాఁడాదిగా
నిదియే లోకముగాని వేఱొకటి లే
దేక్కాంత మైనప్పు డో
ముదితా, వానివిరాళిఁ జూడఁ దగ దే
షో భ్రాంతునిం బోలె మా
మదికిం దోఁచును నిల్పుచో నిలఁడు వే
మా రుస్సు రంచుఁ నగున్.

సీ. చదరంగమున కెత్తు నవరించు కైవడిఁ
దల వంచి వెతఁ గుందుఁ దెలియకుండఁ

గవిత లాలోచించుగతి మిన్నుదెసఁ జూచి
యేమేమొ తలపోయు నెఱుఁగకుండఁ
గలువపువ్వులబంతి చలువఁ గైకొనురీతిఁ
గన్నీరు పో నొత్తుఁ గానకుండ
వడి కేలి తమ్మిపుష్పొడి నూఁదినటు వంత
తో నుస్సు రంచనుఁ దోఁచకుండ
నెంత మది చింత పొడమిన నించుకైనఁ
దోడిచెలికాండ్రకును దెల్పఁ బోఁడు నృపతి
యతనితాపంబు లోలోనె యడఁగి యుండుఁ
గాలకూటంబు మ్రింగినశూలిలీల.

క. తను మిగిలినరూపరి యని
మనసిజుఁ డిటు సేయు చున్న మాత్సర్యముచే
వనితా, చక్కఁదన మ
న్నను దగునది గాక మిగిలినం దగ వగునే.

క. అతఁ డింతకు మతి నెంతటి
హితఁ జెందునొ తెలియ రాదు వేచని యొసఁబ
ర్వతుతో మే మడిగితి మను
మతివా, నీకడకు వచ్చినప్పుడు నియతిన్.

గీ. కొమ్మ, నీభావ మే మని కొన్ని మాట
లాడ నేరక పోయినవాఁడఁ గాను
నెలఁత, నినుఁ జూచినప్పుడ తెలిసె నాతఁ
డింత కే మానొ యది గదా యెల్లపనులు.

మ. అనినం గామిని నెమ్మదిం బొగిలి య
య్యా, యంతగా మీనృపా
లునకుం గల్గినఁ జాలు మీరు మది నా
లోచించినం గాకపో
వునె ముఖ్యాంబర్వతుచేత విన్నపుడె దే
వుండొక్కఁడే సాక్షిగా
దనయాధీనము సేసితిం దనువు మీఁ
దట్ మీఁద చిత్తం బికన్.

చ. అతనికి నాకు సంఘటన
లొనటు సేయుభరంబు మీఁది మీ
రతులగతిన్ జనన్ వలయు
నానృపుఁ డింతక యెంతచింతలన్
వెతఁ బడుచున్నవాఁడొ పద
వే యని యమ్మని వీడుకొల్పి యా

సతి తన కింత నంత పోద
    చాటునఁ బొంచినబోంట్లఁ జేరినన్.

ఉ. ఒక్కమిటారి కేలిఁ గొను
    చున్నపడంతుల రాత దల్చి యో
యక్కరొ యెవ్వఁడే తపసి
    యాతఁడు మాట ల దేమి యాడితే
గుక్కకు మింక పెండ్లిపలు
    కుల్ వలె నుండెనో నేడొ రేపొ మా
యక్కవు గావె తెల్పు మన
    నా నది యైనఁ గదా ముదంబునన్.

గీ. అంతమా కేల పల్కెద వంబుజాక్షి,
యెంత వాఁడైన నిన్ను విన్నంతతోన
కంతునసకోలమొనపాలు గాక యున్నె
యంతయును వింటి మాపొదపొంత నుండి.

క. పర్వతునిచేత గా దిది
నిర్వాహకుఁ డితఁడు మంచినేర్పరి దొరికెన్
బర్వేందువదన, మాటల
పూర్వోత్తర మెఱుఁగ పలుకుపోడిమి దెలిసెన్.

మ. అన సావిత్రి పడంతులం గనుచు నా
నా నంతవాఁ డైన నే
మనుమాన మ్మొక టీత డయ్యెడలఁ గ
య్యాల్ సేయునే కాని యీ
పనికిం బూనఁడు దైవయత్నమున నా
భాగ్యంబునం బూనెనో
య్యన మాటాడక మున్నె యానృపతి యే
మౌనో మనోజవ్యథన్.

గీ. చెలువుఁ డటులుండ నా కింటితలఁ పిఁ కేల
ప్రొద్దు గ్రుంకెడు నిండ్లకుఁ బొందు మీఁద
నమ్మతో మాత్రమును దెల్పుఁ డమ్మలార,
అయ్యతో నాడఁ బోకుఁ డావంతయైన.

సీ. చెలులార, మీ రేల చిలుకలఁ దోలఁగా
నలుకుగా నవియును బలుకుఁ గాక
సతులార, మీ రేల చలిగాలి నేఁచగాఁ
గసరుగా నవియును విసరుఁ గాక
సఖులార, మీ రేల పికములఁ గదమఁగా
బెదరుగా నవియును వదరుఁ గాక

కోమలార, మీ రేల భ్రమరాళిఁ దఱుమఁగా
వేఁగుగా నవియును మూఁగుఁ గాక
నామనోహరుఁడౌ ప్రాణనాథుఁ డచటఁ
జింతవంతలఁ బొరలుట చెవుల వినియు
బ్రాణములు నిల్పునావంటి పడఁతి యెడల
నవియు నిటు సేయ నుందునే యమ్మలార !

మ. ననలుం గందము గప్పురం బొడలి మం
టంబెట్టుచో నంటి మి
మ్మును నన్నుంటకుఁ డమ్మ యమ్మరుని య
మ్ముల్ గ్రమ్ముచో మిమ్ముఁ దాఁ
కునొ యేమో కడ కేఁగుఁ డమ్మ మదిలోఁ
గూర్చున్న నాకాంతు నొ .
య్యనఁ గాపాడును పాయనుం దెలుపుఁడ
మ్మా, నాకు మేల్ గోరినన్!

మ. అనుచుం గన్నులు దేలవైచుఁ జెలులా
రా యిం కిటం బుద్ధి యే
మనుఁగాంతుం డెటు లున్నవాఁడొ కద రే
యించుక్ వచించుక్ నిజం

బునకున్ నారదుఁ డేఁగునే యను నదే
మో మీరు పోలేరుగా
యను నల్వంకలఁ జూచు లేచుఁ బొరలున్
హా దైవమా యంచనున్.

క. ఈలీల గోల మరువిరి
కోలలపాలై విరాళిఁ గొని యటు లుండన్
బాల యొక తె వలికెను ద
త్కాలోచితవృత్తిబ్రౌఢగడపుటకుఁ దగన్.

మ. వనజాక్షీ, కనుఁగొంటి వే నయనప
ర్వంబౌచు నస్తాచలం
బున నొప్పెన్ రవిబింబ మెజ్జిజిగిచేఁ
బ్రొల్పొంది నీకాంతుఁ డ
ల్లన మాణిక్యవిభూషణంబు • లెదఁ గ్రా
లన్ రేపు నూరేఁగుబా •
గునఁజెన్నారెడు పెండ్లిపీఁటపయి దాఁ
గూర్చుండుతీరుం బలెన్. •

క. వనితా, సంధ్యారాగము
తనరెను మీరొకరి కొకరు తమిఁజూడక ము

న్ననువుగఁ గల్యాణపుజగ
తిని బట్టెడుచంద్రకావి తెరయుంబోలెన్.

గీ. చూచితే ముందు వెన్కయుఁ దోఁచ కొకటి
కటికిచీఁకటు లెల్లెడఁ గ్రమ్ముకొనియె
నువిద పతిమ్రోల నీవు గూర్చున్నవేళ
నిన్ను నునుసిగ్గు పై ముంచుకొన్నరీతి.

క. నల్ల నగుమింట నెగడెడు
తెల్లనితారకలు చూడు తిలకించెను నీ
వల్లభుఁడు నీదుతలపైఁ
జల్లినతలఁబ్రాలరీతి జలజాతముఖీ.

ఉ. కాంతరో చూడు తూరుపునఁ
గానఁబడెం దొలి గట్టు మీఁదఁ దా
వింతయు చంద్రమండలము
వెల్లనికాంతి వివాహ మైనచోఁ
జెంతను నీవు నీపతిభు
జింపఁగ ముక్కాలిపీఁటఁ బువ్వపుం
బంతికి వెండిపళ్ళె మిదు
బాగు గనంబడెఁ జూడఁ జూడగన్.

గీ. అనిన నొక్కింత నవ్వి యోయంబుజాక్షి
వంతఁ బడువారి నవ్వింప వచ్చె దీవు
బయలు పందిరి వెట్టెదు ప్రౌఢ వౌదు
వెన్ని యుపమలు కల్పించి తింతలోన.

శా. తల్లీ, యింతటిభాగ్యముం గలిగినం
దాఁ జాలుఁబో చంద్రునిం
బల్లెం బం చన నేర నే మనసులోఁ
బాల్ త్రాగఁగాఁ గోరుచో
జిల్లేడాకుల దొప్ప గావలయునే
చింతింపఁగాఁ జంద్రికల్
వెల్లంబాఱు నభంబు వెండిజిగి ప
ల్లెం బన్నఁ గారాదొకో.

మ. అతివా, యెక్కుడిమాట మాటల పరా
కై యుంటిఁ జంద్రుండు గాఁ
డతఁ డానల్వు కళంకు గాదు మదనుం
డన్ సాహెబూపం ప నన్
వెతలం బెట్టఁగ నిల్వకోక లటు లెం
తేఁ బాల్చి చూడంగ ను

ద్ధతుఁ డౌ నల్లనిమోముతోడ బిసిరా
తౌనీతఁ డళ్కయ్యెడిన్.

చ. అని కనుదోయి హస్తముల
నాని వడంకుచు నున్నకన్నె న
క్కునఁ గదియించి యేల భ్రమఁ
గుందెద వమ్మరో నారదుండు మూ
పునఁ దనవీణ మోచుకొని
పొందుగ నీపతిమేలివార్త నీ
కును వినిపింప వచ్చె నది
గో తిలకింపు మనన్ ముదంబునన్.

క. కను విచ్చి చూచి కాదని
కనుఁగొనలన్ నీరు జాఱఁగా నున్న రటం
చును ననవిలుతునిములుకులు
వెనుదగిలె నటంచుఁగురులవిరులన్ విడుచున్

సీ. మరునితూపులఁ గంది మగువ నివ్వెఱగంది
పరువుతో వెన్నెలబయిటికేఁగు
వెన్నెల మై సోఁక వెలఁది నిల్వఁగ లేక
నెఱిగుంపులేమావి నీడ నిలుచుఁ

జిగురు మావిని జిల్క చెలఁగి పల్కులు గుల్క
విరిబోఁడి సురపొన్న సరస కరుగు
సురపొన్న విరిచాయఁ జొక్కి తేఁటులు మ్రోయఁ
గలికి బంగరుతమ్మికొలనుడాయు
కలఁగు మదిఁ దారు నాల్గువంకలకుఁ బాఱుఁ
జలువలను గోరు గపురంపుసరవిఁ జేరు
విరులపొదఁదూఱుఁ జెలిఁ జీఱు మరునిదూఱుఁ
దత్తఱము మీఱుఁ దొలుతటితప్పులేఱు.

క. ఇటులు పరితాప మందుచు
నటు నిటు వెతఁ గుందుచుండ నాప్రాణసఖుల్
కటకటఁబడి పడఁతుక నో
ముటకై శైత్యోపచారములు సేయునెడన్.

గీ. ఇంతి యొక్కతె సావిత్రి నెదను జేర్చి
కూర్మి నొకకొన్నిమాటలఁ గుస్తరించి
కొమ్మ యిందున్న దనుచాయఁ గోయటించుఁ
బలుకుకోయిలకడ చూచి పలికె నలుక.

క. తలఁపఁగ నినుఁ గని పెంచిన
బలఁగము సహితంబు చెట్లఁ బరపిరి పికమా

యిల యెంతపేరు వెట్టిరి
కలకంఠ మటంచు నిన్నుఁ గాకులుపొడువన్.

క. అనుచునలిమింటి పైఁ బడు
ననువునఁ బొడచూపునామృగాంకునివంకన్
గనుఁగొని మనమునఁ బెనఁగొను
కినుకను బేరుకొనుచుఁ బలికెను జెలి యంతన్

చ. చదివెడువారి కెల్లఁ దలఁ
చం దలవంపులు జేసినావు దు
ర్మదమునఁ బిన్ననాఁటిమహీ
మల్ దలపోసిన సిగ్గు గాదె యా
మొదలిటిప్రాఁతఱంకు పయి
మోపుక యే ద్విజరాజ నంచుఁ ద్రు
ళ్ళెద విలమీఁద నీకు గతి
లేదు నిశాచర బాస చేసెదన్.

క. ఆహారునిఁ గన్నుఁ గానక
యాహా, తలద్రొక్కినా వటందురు చంద్రా,
సాహస మటరా దేవ
ద్రోహము నేఁజెల్ల! పచ్చితురకవు గదరా!

గీ. అనుచుఁ బై వచ్చు తెమ్మెర కనియె బోటి
యవ్వర, నీ వింత సోఁకినయంతలోన
నోడలెఱుంగక వడఁకుచు నున్న దబల
గాలి యనుమాట యిది నీకుఁ గల్ల గాదు.

క. అని యింతకు మూలము క్రొ
న్ననవింటివజీరుఁ డనుచు నలు దెసఁ గనుచుక్
నునువిరుల రాల్చుతరువులఁ
గనిశరముల నేయుమరునిఁగాఁ గని పలికెన్.

మ. శివుఁ డేమో నిను భూతి చేసె ననఁగాఁ
జె న్నొందితద్వాక్యరీ
తి విచారింపక నమ్మి యుంటిమి "విభూ
తిర్భూతిరైశ్వర్య" మం
చువినంగాఁ దెలిసెన్ నిఘంటుఁ గనినన్
జూతంబుతో నింద్రజి
త్తు వగన్ మబ్బున డాఁగి యేతురె జగ
ద్ద్రోహంబుగా మన్మథా!

క. అలశివునికంటిమంటలఁ
బోలు కెల్లన్ మంటఁ గలసిపోతివి తిరుగం

దలపోసి మాచినాయఁడు
గలఁడే మాపాపఫలము గా కిది మదనా!

మ. అని దూషించుపడంతులం గనుచుఁ గ
న్యారత్న మోయక్క, ప
క్క నీయన్నల నేల దిట్టెదవు భా
గ్యం బింతగా నోచితే
యని నన్ దిట్టుము కాక నాదుపతి న
న్నాసక్తి మన్నించుచో
ననుఁ గా దందురె వీర లెట్లగునో ముద్
బ్రహ్మానుకూలం బొగిన్.

క. నా విని యావనితామణి
నీ వింతగ మదిని దెలియ నేర్చుట చాలున్
నీవిభునిచెంత నుండియు
నావేలుపుఁదపసి రేపె యనుదెంచు ఁజుమీ.

చ. సకియరో చూడు మాచరమ
శైలమునన్ నెల గ్రుంక నీడఁ జా
డకరుఁడు తూర్పుకొండను గ
నంబడెఁ గాలము పేరిమైంద్రజా

లికుఁ డొకచిప్పలోపల తె
లిం గలబంతి నడంచి యొక్కచి
ప్పకుఁ బయిఁ జూపెనో యెఱుపు
బంతి యనం జెలు వొందె వింతగన్.

ఉ. ఇంతకు నారదుండు మన
యింటికి వచ్చునో యేమొ నీమదిన్
వంతలు దీరుమంచి శకు
నంబులు గానఁబడెన్ బడంతి యిం
దింతవడిన్ జరించఁ దగ
దింటికిఁ బోదము ర మ్మటంచునన్
గొంతటి యుక్తి యూ ననుచుఁ
గొమ్మలు సమ్మతిచేసి పిల్వఁగన్.

క. సావిత్రి తనదునగరికి
నావెల్లఁదులతోడ మగుడి యచ్చుట నెంతేఁ
దా వగఁ గుందుచు నారదుఁ
డీవేళకు రాఁ డటంచు నెంచుచు నుండెన్.

గీ. అనిన మునినాథునకు ధర్మతనయుఁ డనియె
మానికులచంద్ర, నారదమాని యిపుడు

వడిగ నలసత్యవంతునికడకు నేఁగె
నని వచించితి రవి యెల్ల నానతిండు.

సీ. నావుడు విను మంత నారదుం డావేళ
మరునితూపుల శయ్యఁబొరలుచున్న
సత్యవంతుని ప్రోల సంతసంబున నిల్వ
నతఁడు కన్విచ్చి సాష్టాంగ మనుచు
మెల్లనె వచియించి మీరు వోయినకార్య
మే మని వేఁడ మౌనీంద్రుఁ డనియె
మంచిది గాక నీ వంచినపని గాక
పోవునే యన్న భూభుజుఁడు నగుచు

సఖులఁ గడకంటఁ గని వారు సైఁగ తెలిసి
యవలఁజని నిల్వ మఱియేమియుచటిమాట
లతివ యేమనె మీర లే మంటిరపుడు
తెలుపుఁడనిపల్క నమ్మౌనితిలకుఁడనియె.

చ. నృపతికుమార, మద్రపతి
యింటికి నేఁజనలేదు పూజకా
యుపవనమందు నాసపడి
యొంటిగఁ బూవులు గోయుచుండ నా

జపసర మొక్క చిల్క గొని
సైఁగఁగఁ జూఱఁగ నేను బోవుచో
నవు డొకవింత గంటి పొద
యాకడ నే కడఁ జూడ నెన్నఁడున్.

క. మెఱుఁగో ఘురువిరిశరముల
మెఱుగో తెలియంగ రాదు మేనితళతళల్
గరగరిక నిన్ను నైనం
గరిగఱగాఁ జేయు నేమి గణుతింపఁ జెలీ.

గీ. చిలుక చేఁ గొన్న జపసరం బలికి మాకు
నొసఁగుటకు వచ్చె మెల్లన బిసరుహాక్షి
యపుడు మత్తేభమని తోఁచె నంత దెలిసె
నెదిరి రజతశుక్తిన్యాయ మిదియటంచు.

గీ. అపుడు మాకు సమస్కారమనియె నతివ
యామృదూక్తికి మెచ్చి ముత్యములు నోట
నించవలె నంచు మది నెంచ నృపకుమార,
తరుణి పలుచాలయత్నకృతంబు లయ్యె.

గీ. ఇంతిమునివ్రేళ్ళ జపసర మీయఁ రాఁగ
గోళ్లు నలవేళ్ళ యిది యొక్క కొమరుగొలిపె

కొమ్మయటు ద్రిప్ప ముత్యముల్ కూర్చినటులు
చెలియయిటు ద్రిప్పఁ బగడముల్ చేర్చినటులు.

గీ. మునుపు నీవీణ చూచినానని వచించు
చో నొఱపు గాఁగ నేలు కేలినుం...
తోఁచె మామది గుబ్బలతోరమున్నఁ
గాను విఱుగక యుండచేఁ గాచెననుచు.

గీ. వనిత నాశిక నువ్వుఁ బు వ్వనుచునుండి
వెనుక సంపంగి యని తోఁచె వీణె మీాటు
తఱిని దటిలేచి నెమ్మోముఁదమ్మి తేనె
నలకలను తేంట్లు గొనకుండ నిలుపవలయు.

గీ. నీప్రసంగపుమాటలు నే వచింపఁ
బడఁతి కడకంట బోటులకడను జూచె
నెపుడు శ్రీహరిసాక్షిగా నృపకుమార,
నిండె నీభాగ్యమను కొంటి నెమ్మనమున.

క. ఆసొగసు చూడ నేరక
రాసుతుఁడు స్వయంకృతాపరాధను నే నీ
వేసటయు విరహ మెన్నితిఁ
దా స్రుక్కెను నాతి ముద్దుఁగుఁదామరరీతిౕ.

క. ...ను పంప నే నొక
 పొదమఱుఁగున నుండి కొంత పొంచితి నిపు డా
 మదవతి విరాళి నడిపిన
 నెది నీవు కవిత్వమందు విఁక నే మందున్.

గీ. చెల్లులు ప్రౌఢ లౌటఁ జీటికి మాటికి
 నబల...తు టదిగొ యిదిగొ
 యనుచుఁ బలుకఁ గలికి యడియాసచేఁ బ్రాణ
 మొక్క రీతి నిలిపె నో కుమార !

ఉ. అంచు వచించినన్ నృపతి
  హా యని కన్నుల నీరు నించి రె
 ట్టించినవంతచేఁ గలఁగి
  డెందముఁ జిందరవందు గాఁగ నొ
 క్కించుక ధైర్య మూఁది నుతి
  యుంచి విరించికుమార మీర లే
 మం చరుదెంచినార చట
  నశ్వపతిన్ గని రాక యిట్యెడన్.

గీ. అవల వేయునబద్ధము లాడి నైన
 నొక్క పెండ్లి చేసిన నది యుచిత మండ్రు

కాన నెటులైన మద్రభూకాంతుతోడఁ
బొసఁగ మాటాడుఁడని మునిఁ బోవఁ బనిచి.

సీ. చెలి పటంబున వ్రాసి చెలు వెగాదిగఁ జూచు
మదిరాక్షి...మనసు నిల్పు
రమణి నెన్నఁడు గూడి రమియింతునని యెంచు
హా, యిందుబింబాస్య, యని వచించు
నెలఁతను దలపోసి నిద్దుర వేగించు
మగువపైఁ దమిచేత మై కృశించు
రుచిరాంగిపై వింతరుచులను విరసించు
నువిదపై భ్రమ లజ్జ నవలఁద్రోయుఁ
గలికి తలఁచి మేనికాఁకచేఁ దపియించు
ముద్దియ మది నెంచి మూర్ఛపోవు
నాన్నృపాలుఁ డిటు దశావస్థలను బొందు
చుండు నిచట నారదుండు నంత.

సీ. కొన్ని దినంబులకును మద్రపురమున
కరిగి యచ్చోట నంతిపురములోనఁ
పగడపుఁజవికలోఁ బగ......డుచు
మాళవితో నున్నమద్రపతిని

గాంచి వారలనతుల్ గ్రైకొని కూర్చుండి
యవ్వాల ముసిముసినవ్వు దొలఁకఁ
దనుఁ జూచుసావిత్రి దయఁ గనుంగొని రాజు
వలని కైచూచి యోవసుమతీశ!
యెవ్వ రీకన్య నీకూఁతురే మతేమి
భాగ్యశాలివి యెన్నఁ డీపడుచుపెండ్లి?
తగినవరుఁ డున్నవాఁడొ పొంతెనము లమరి
యున్నవే సత్యవంతుఁడా యన్న నగుచు.

మ. జననాథుం డనియెన్ మునీంద్రతిలకా
సర్వజ్ఞ! దైవజ్ఞు లీ
రనుటల్ తప్పునె? సత్యవంతుని నె పెం
డ్లాడం దలం పూనె ని
య్యనుఁగుంగూఁతు; రతండు మీకుఁ గడునె
య్యం బైనశిష్యుం డటం
చును విన్నా మిది మాకు భాగ్య మిటు నం
చుం బల్కుఁ దా నిట్లనెన్.

ఉ. ఆతఁడు మాకు శిష్యుఁ డని
యంటివి గా నిజ; మైన నేమి సం

గీతము మాత్ర మే మతని
కిఁక మఱి నేర్పుట; లేకవిత్వ మే
మాతనిచే గ్రహించితిమి
యందమనఁ గాదె ప్రబంధయత్నముల్
సైతము సేయఁ గోరితిమి
చాయకుఁ బోక స్వతంత్రకేళిగన్.

క. మక్కువను మొన్న నాతని
చక్కఁదనంబునకుఁ గాదె సరసపుఁబద్యం
బొక్కటి రచియించితిఁ గవు
లక్కట ఘుమఘమపుఁగవిత లల్లన్ గినుకన్.

ఉ. నీవగ గుల్కుపల్కులకు
నీనునువీనులు జొక్కు నీమతే
మోహిని నీమకన్నఁగవ
ముద్దుగొనన్ దలపోయు నన్నునోఁ
దా వినఁ జూడ నేర్చు వని
తామణి చొక్కక ముద్దుగోరకే
పోవునె సంత్సవంత, యతి
భోగజయంత, నితాంతవైభవా.

గీ. అనిన నొకకొంద ఱిది విని యతిశయోక్తి
యనిరి నేను స్వభావోక్తి యనుచు నల్లె
నిర్వహించితి నందు నానృపతి కొన్ని
పలుకు లపు డాడె నవి యొకపద్యమయ్యె.

గీ. అప్పుర, నాస్వామి కవిరాజ వపుదు వయ్యె,
బట్టబయట రసస్థితుల్ పరగఁజేసి
మెఱుఁగు గల్పించఁ గలఘనుల్ మీరె కారె
కాక యుండిన నారసఖ్యాతి గలదె.

గీ. అనుడు పద్యము విని మెచ్చి రచటి పెద్ద
లతనిఁ బొగడంగఁ దరమె బ్రహ్మాదులకును
వింత గా దిది వాని వరింతు ననుచుఁ
బ్రతినఁ బూనినయాకాంత భాగ్య మెంత.

క. ఇందులకుఁ గొదవ లే దొక
సందేశము గలదు రాజసంక్రందన, మే
మందుం డిటు రాఁగా నీ
సందున నొకజోలి గలిగెఁ జక్కఁగ వినుమా.

క. అది మఱి దేవరహస్యం
బది యెవ్వరు వినఁగఁగూడ దంచఱిఁ గడగాఁ

బద మనుము నీవు కూఁతురు
నిది వినుఁ డని మాని దెలిపె నేకాంతముగన్.

సీ. జననాథ, సత్యవంతుని కడనుండి మే
మిటు వచ్చుచో దేవభటుఁ డొకండు
బ్రహ్మయు మఱి సరస్వతి వీణెల్లయను వ్వాదు
గలిగి గొబ్బున నన్నుఁ బిలువు మనిరి
రమ్మన్న నపుడు నే బ్రహ్మలోకము చేరి
యంతఃపురంబున కరుగుచుండఁ
గోణవాఁకిట నొక్క కొమ్మయు సావిత్రి
యనుగూడి గుసగుస మనఁగ నిలిచి
యమ్మ యిది యేమి యేకాంత మంటి నన్న
నన్న మీశిష్యుఁ డెచ్చట నున్నవాఁడు
వానిపురమున నుండియే వచ్చి తిపుడ
యతనిమాటలె కావె యేకాంత మ్మనియె.

ఉ. నావుడు దేవి బ్రహ్మతిరు
ణాళ్ళకు వేంకటశైలనాథునిన్
సేవ యొనర్పఁ బోయితి వి
శేషము లేనడుమన్ మఱేమి యై

నా వినినారో యంటి నని
నఁ బుడమిఁ రిపు లాక్రమించిరఁ
దావిగతాత్ము లైనతలి
తండ్రులతో వనిఁ జేరె నంచనెఁ.

సీ. అంతలోన విధాత నాదేవి నన్నును
బిలువ నంపినఁ బోయి కొలిచి యుండ
సావిత్రి బ్రహ్మతో సత్యవంతునిమాట
కే మంటి వనఁ బెండ్లి కేటి మీఁదఁ
గద గండ మిపు డేమి మొదటి నారాయణు
చేతియొప్పుపు లేఖ వ్రాఁతఁ జూడు
మనుచు ముందఱ నుంచఁ దనకుఁ గా నిది దిద్ది
నుంచిసంప్రతుల వ్రాయించు మనిమె
ననిన నది మేర గాదు నా కైన వ్రాసి
కొనెద నిప్పుడు మఱవక వెనుక నైన
స్వామి యుత్తరు విప్పింప వలయుననుచు
వ్రాసికొని మమ్ముఁ బొమ్మనె వనజభవుఁడు.

క. అంతటను దేవి నాతో
వంత విడువు లేఖ బాగ వ్రాయించితి శ్రీ
కాంతునియుత్తరు వొక్కటి
యింతే యయ్యెనిపుడమి కేఁగు మనంగఁ.

ఇక్కడ కొంత గ్రంథపాత్రము.

నారదుఁడు, సత్యవంతుని జీవితపరిమాణమును, సావిత్రికిని నామె తండ్రికినిజెప్పుట, సావిత్రి ఏమయినను, సత్యవంతునే వరింతుననుట, సావిత్రీ సత్యవంతుల వివాహము, ప్రధానముగా నాలుగు ప్త గ్రంథభాగమున నుండఁబోలును.

గీ. అవధరింపుము పాండవేయాగ్రజునకు
ఋషివరుండు మార్కండేయుఁడిట్లు లనియె
నటుల నాయత్తమూమల కాత్మపతికిఁ
జెలఁగి సావిత్రి పరిచర్య సేయు చుండ.

చ. తమి గొని సత్యవంతుఁడును
దా నొకచొక్కపుఁబర్ణశాలయం
దమరినపువ్వుఁబొన్పునఁ బ్రి
యంబునఁ దేలుచు వింతవింతచం
దముల రమించుచుండి యొక
నాఁటినిసిన్ దెలవాఱుజామునం
దమరమునీంద్రుఁ డల్లయపు
డాడినయాపలుకుల్ తలంచుచున్.

సీ. మునుపు గుబ్బలరొమ్ము మనసు దీరగఁ గ్రుమ్ము
గడు నొచ్చెనో యంచుఁ దడవి చూచు
మొదటగోటను జెక్కు సదమదంబుగ నొక్కఁ
దుదఁ దాఁకెనో యంచు వెదకి చూచుఁ
దొలుత వాతెఱ కెంపుదొరలఁబంట ఘటింపు
వెనుక నాటెనో యంచు విచ్చి చూచు

ముందటఁ బైకొంచు ముచ్చటారఁ రమించుఁ
బిదప డస్సెనో యంచు పిలిచి చూచు
మున్ను మదికున్న పెనఁగొన్న మోహామునను
దగుతగము లెంచ కెంత కెంతకుఁ బెనంగుఁ
బిమ్మటను నాఁటిమాటకు సొమ్మసిల్లి
కొదుకు నేమిట నేమనో యటంచు.

క. ఈరీతి మనసు త్రొక్కట
తో రాతిరి కూటమాగతో(?) భోజన మై
కారాకూరము సేయఁగ
నారాకూఁతురు దినంబు లరయుచు నుండన్.

క. చుక్కలజిగి మాసెను కవ
జక్కవలకు వేడ్క సాగెఁ జక్కెరవిలుతుం
డెక్కడికో యేఁగెను దమ
కెక్కడిబ్రతు కనుచుఁ జీకకెల్లను డాఁగెన్.

ఉ. తూరుపు తెల్ల నైన రవి
దోవక మున్నుగ లేచి తా నలం
కారము మీటి వేడియుద
కంబుల నత్తకు మామగారికిన్

గూరిమితోడ స్నానమున
కుం ఘటియించి ప్రియుండు వారికిం
గూరుచునాసపర్యలకుఁ
గోరిన దెల్లను దా నమర్చుచుణ్.

క. అలపతి ఘాలమునఁ దెచ్చిన
పలుదెఱఁగులకందమూలఫలముల నాయా
తలఁ పెఱిఁగి రుచుల నమరుచు
నలరుచు భుజియింపఁ బతికి నయ్యిరువురకుణ్.

గీ. ఇటుల వారికిఁ బరిచర్య నింపు చేసి
తాను భుజియింప నొల్లక తనకు వార
లొసఁగుదీవన లెన్నుచు నొక్కచోట
నొంటి నేకాంతముగఁ గూరుచుండి యపుడు.

మ. మొదల న్నారదుఁ డాడి పోయినదినం
బ్బుణ్ గూడ మున్నూటయేఁ
బదియా ఱయ్యె దినంబు లికక గణియిం
పన్ నాలుగోనాఁటికిణ్
గద నారాయణపాదపద్మములు నా
కాంతుండు సేవింప నో

నది యీాలో ఋతువేళ రా నిది యభా
గ్యం బింక నాపూన్కికిన్.

క. నిరు డీదినములనే కద
హారిహారి మఱి పెండ్లిపాట లై యుండుట లో
క్కరు గడవఁ గలరె జగదీ
శ్వరుఁ డిఁక నెటు సేయ నున్నవాఁడో తలఁపన్.

క. కా నున్నది కా కుండునె
కానిది మఱియా నె! కమలగర్భుఁడు మొదటన్
దా నొసట వ్రాసి యుండఁగ
నే నేల విచారపడఁగ నిటు నటు లంచున్.

క. ఈవగ్గ ననుఁ బుట్టించిన
సావిత్రికి లేనిబరవసము నా కేలా
నావలనఁ గొదువ లే దిఁక
నావల్లభుతోడి దయ్యె నాజీవనమున్.

క. అని సావిత్రిని గొలిచెద
ననుచుఁ ద్రిరాత్రోపవాసమగు నొక వ్రతమున్
మనమునను బూని యప్పటి
యొనరిక పరిచర్య సేయు చుండెం బతికిన్.

గీ. ఎంత దాఁ జెప్పినను భుజియింప కున్న
సత్యవంతుఁడు సేరి ప్రసంగముగను
దండ్రి కెఱిఁగింప వగచి యతండు వడిగఁ
గోడలిని బిల్చి కూరిమితోడ ననియె.

శా. తల్లీ యీవఱకుం భుజింపవట సం
ధ్యాకాల మాదాఁక నే
చెల్లంబో భుజియింప కుందురె మహా
సింహాసనస్వామి రం
జిల్లం గాంచినముద్దుపట్టివి మ త్రే
సింగారముల్ లేక నా
యిల్లుం జేరుటఁబట్టి యిట్టివెత లా
యెఁ గా మా యభాగ్యంబునన్.

ఉ. అన్నము లేక యున్న మఱి
యా కలమైన ఫలంబు లైన నిం
దున్నవి నీవునున్ సరసి
యుంచి భుజింపక యుందు రమ్మ యా
కన్నులు లేనిదుఃఖమును
గానక యుందుము నీవు పోవ మే

మన్నది యేమి లేదుగద
వమ్మ యి దేమిటి కష్ట యిప్పోయిర్.

క. నాకూఁతు రనుట లే దిఁక
నీకోడ లటంచుఁ గంటి నీరు దొరుగఁగా
నాఁకటికిఁ దాళలే దని
మాకుర్ మీతండ్రి తెలిపె మగువా తాలుతర్.

మ. అనుచుం గన్నుల నీరు నించుకొన స
య్యబ్జాక్షి పాదంబుపై
నెనయర్ వ్రాలి భవత్ప్రసాదమున నా
కిష్టాన్నముల్ లేవె బా
పనము త్తైదువు లెల్ల నోములు ఘటిం
పర్ నాకునుం నోమఁగా
మన సైపూనితి నీవ్రతం బొకటి మా
మా! దీన మే లొందెదుర్.

శా. మళ్ళర్ మీర లనుజ్ఞ లీవలె నవర్
మాయమ్మ కానిమ్ము మా
కెల్లర్ నీవాక తేప నాపదలుబో
య్యేనోముగా నోముమీ

తల్లీ ని న్నవుఁ గా దనన్ వెఱతుమా
దారిద్ర్యముం బోయె నీ
వుల్లాసంబున నాదిలక్ష్మివలెనే
యుండంగఁ జూడన్ వలెన్.

గీ. అన్నఁ బ్రియమంది సావిత్రి యుహారహంబు
మగని నెడఁబాయ కాయత్తమామలకును
గొలువు సేయుచు మూఁడుపూటలు గ్రమించి
తెఱవ తరువాత నాలవదినమునాఁడు.

ఉ. ప్రొద్దున లేచి తాఁ బసపు
పూసుక కుంకుమ బొట్టు దీర్చి యా
పెద్దలకెల్ల మ్రొక్కి తన
పెన్మిటికిం బరిచర్య సేయఁగాఁ
బ్రొద్దొకజాము సాగుటయు
బ్బోటిని బిల్చి ప్రియంబుతోడ నిన్
వద్దన లేము చాలు నుప
వాసము పారణసేయు మింకిటన్.

క. అనినన్ మామకుఁ గోడలు
వినయంబున మ్రొక్కి రాత్రి విధుమండలముం

కనుఁగొనినదాఁక పారణ
యొనరింపఁగ రాదు కొదవ యున్నది నేఁడున్.

క. అని తెలిపి సత్యవంతుఁడు
పనిపూనుక కందమూలఫలములు తేరన్
వనమున కేఁగెడు కదలికఁ
గని యిడి బాగయ్యె ననుచుఁ గళవళపడుచున్.

క. ధవునిచెంగటి కరిగి పాదముల కెఱఁగి
వనుల వింతలు నేఁ జూడ వలయు ననిన
నెన్నఁడును గోర విది యేమొ హేతు వనుచుఁ
జెలియనునుఁజెక్కు టద్దమ్మునఁ జేరి పలికె.

మత్త. వేడుకన్మును కేళికావని
వీథులం బువుఁబోఁడ్లతోఁ
గూడిమాడి చరించ నేర్చిన
కోమలాంగికి నీ కయో
నేఁడు ముచ్చట లయ్యె నీమృగ
నిష్ఠురాటవిలోన నా
టాడఁగా ననుఁ జెట్టవట్టిన
దయ్యెయుందుల కోసమే.

ఉ. మెత్తని నీ తనూలతిక

మేకొన నొల్లదు పైన నున్న నీ

తత్తర మెంచ నన్ నిలువఁ

దాళదు నే నెటు లాడ లేను నీ

యత్తను మామగారిని బ్రి

యంబున వేఁడుము మంచి దంచు నా

రుత్తరు విచ్చినం జనుద

మోవనితా వనితావు లారయన్.

మత్త. అనిన భాగ్య మయ్యె నంచు

నత్తమామ గారికిన్

వినయ మొక్క మ్రొక్కి యొక్క

విన్నపంబు చేసిరన్

వినుఁడు మీ కుమారకుండు

నేఁ డరణ్యవాటికిన్

దనరఁ బోవు చున్నవాఁడు

నాకు ముచ్చ టయ్యెడిన్.

క. అందుల వింతలు గలవట

చందనముల వగల లతలచంపమ్ముల మా

కందమ్ముల కుందమ్ముల
కందమ్ములఁ జూడ వేడుకలు కొనసాగున్.

క. నా కా వింతలు కనుఁగొన
నాఁకలియును దప్పి పుట్ట దటు గావున మీ
రీకోరినవర మీవలెఁ
జేకొని నామాట త్రోపుసేయకుఁ డనియెన్.

గీ. వగచి నాతల్లి నీవు నీమగఁడు వేడ్కఁ
బోయి రండని దీవించఁ బోయి కటికి
భావ మొకరీతిగా నఱపఱికమైన
తెలివితోఁ బోయి రమ్మని పలికి రంత.

క. సావిత్రి యత్తమామల
చే వేడ్క ననుజ్ఞఁగొనుచుఁ జిత్తం బలరన్
సావిత్రీదేవిని మది
భావించుక మగనివెంటఁ బడివడిఁ జనియెన్.

క. ఇక్కరణిఁ బుణ్యదంపతు
లక్కాననమధ్యసీమ నరుగుచు మఱియున్
దిక్కులు కనరాకుండఁగఁ
గ్రిక్కిఱిసిన యొక్కవనిఁ జరించుచు నచటన్.

సీ. ఇంతేసి బలుమ్రాఁకు లెవ్వాఁడు వేయించె
    నా కానతీ మనోనాథ యనిన
ఇంతేసి యేనుంగు లిం దుండ మన కేల
    యీ లేమి తెలుపు ప్రాణేశ యనిన
ఇంతేసితోఁపుల కేల కట్టరు నీళ్ళు
    జీవితేశ్వర నాకుఁ జెప్పు మనిన
నింతేసిపాదరిండు లిచ్చట నుండఁగా
    హృదయనాయక నగ రేటి కనినఁ

బొక్కిపొక్కి పడుచు నొక్కమాటాడక
కంటనీరు జాఱఁ గరఁగి కరఁగి
కటకటా విధాతఘటన యెవ్వరి కైనఁ
గడవవశమె యంచుఁ గడవడించు.

చ. కనుఁగవ విచ్చి కాంతునిమొ
    గంబు నెగాదిగఁ జూచి నాథ పే
ర్కొన మనపెండ్లి నేఁటివఱ
    కుఁ మఱి యెన్నిదినంబు లయ్యె నం
చన నొకవత్సరంబుసరి
    యయ్యె నటంచు వచింప గుండె భ

గ్గనఁ బగులన్ మదిం బొగుల
హా హారియంచును గన్ను మోడ్చుచున్.

గీ. ఆత్మనాయక యీజీబుటడవిలోనఁ
జండభానుండు రేలు దాఁగుండు నేమొ
యుండకుండిన నిటువంటి యెండలోడఁ
బ్రొద్దు గ్రుంకిన నేడకుఁ బోవ్రఁ జెపుఁడ.

సీ. కొమ్మమేలుగఁ జనుగుత్తులఁ గనుపట్టె
గోరంటవలదె యోగుబ్బలాఁడి
లతకూనమోవి చల్లఁగఁగనుపట్టిప
ల్వాగల నొక్కఁగరాదె చిగురుఁబోఁడి
కలకంఠి పొగడ చొక్కముగాఁగ నెలుఁగిచ్చెఁ
జెవియొగ్గి వినరాదె కువలయాక్షి
శ్యామ క్రొవ్విరివికాసము చూడరాణించె
దండ కాసించరా దా లతాంగి
అనినఁ బతిచతురోక్తుల కల్ల నగుచు
ఘోకుఁ బ్రత్యుత్తరము లీయ నాకుఁ దరమె
నారదుఁడు మీమహత్త్వమంతయునుమున్న
తెలిపినాఁ డది నామది నిలిచి యుండె.

శా. ఆమైఁ జూచితె ప్రాణనాయక గజం
బాపెంటి యేనుంగుతోఁ
గామక్రీడకుఁ బాటెడిం గలసి సిం
గం బుండుటల్ కానలే
దే మౌనో యన నేమి గాదు శరభం
బెంతే దృఢారంభమై
యామూలం గని పొంచి యున్నయది సిం
హంబున్ గ్రహింపం దమిన్.

క. అన నిది దైవాధీనము
వనజోదరుఁ డిట్లు జముని వారింపఁ గలం
డని సావిత్రియు దేవిని
మనమునఁ దలపోసి తల్లి మఱవకు మంచున్.

ఉ. కంటిని తెప్ప గాచు క్రియఁ
గ్గాంతుని వెంబడి జంట వీడఁబో
కంటి మెలంగెఁ దాను దన
ప్రాణము లాతనికై వసంబుగా
నుంటఁ బరుల్ హరింతు రను
యోజనయుం బలె పీరిఁ జూచి నే

నింటికిఁ బోవలే ననుర
    హిం న్నిలిచెన్ నడిమింట భానుఁడున్.

ఉ. అంతట సత్యవంతుఁడు ని
    జాంగనతో నిఁకఁ బోవ కుండినన్
వంతలఁ బొర్లుచున్ ముసలి
    వారలు బారలు చాఁపుచుందు రో
కాంతరో దేవపూజలకుఁ
    గావలెఁ దావులపూవు లంచుఁ దా
నంతట నన్నభూజముల
    నందినపూవులు గొన్ని కోయుచున్.

చ. కరడియ చూచి చాల దని
    క్రమ్మఱ సంపఁగికొమ్మ వంచి పైఁ
దిరిగినకొమ్మకై నిగిడి
    తీయఁగఁ బుప్పొడి కంట రాలఁగన్
జుఱుకుచుఱుక్కునం దుడుచు
    చున్ విరికొమ్మ వదల్చి చాలఁ గొ
వ్విరు లిదె బాల యందుకొన
    వే యని చేతి కొసంగి దీనతన్.

మ. తల దిమ్మెత్తెను మోవు మోచుక్రియ డెం
దం బేమొ వెఱ్ఱెత్తిన
ట్టుల కానంబడె మేను త్రోపువడిన
ట్టుల్ వాలెడిఁ ఱొమ్ములో
శిలవోలెఁ బరువయ్యెడిం గడుపులోఁ
జే పెట్టి గాలించు బా
గుల జాలయ్యెడు బోటి తాళుకొన నా
కున్ గూడ వావంతయుఁ.

శా. కొమ్మా పట్టు మటంచుఁ జెక్కు నునుచె
క్కుం జేర్చుచుఁ వ్రాలి యో
యమ్మా నే నినుఁ జూడనైతిఁ గదె య
య్యో యెంత చింతింతువో
యమ్మా యా విధి యింత సేయు నని యా
హా కానలేనైతిఁ గా
మమ్మిం బ్రోవు ముకుంద మాధవ హరే
మాం పాహి సర్వేశ్వరా.

చ. అని నిదురించురీతి నయ
నాంబుజముల్ మొగిడింపఁ జూచి యే

మనక పతివ్రతాతిలక
మంత హరిస్మరణాంతరంగయై
కనుఁగవ నీరు నించక వి
కారము లేక గరంబు మ్రింగి వ్రా
లిన శివుచెంత నున్నసతి
లీల నిజేశునిఁ జూచు చుండఁగన్.

వ. కనియె ముంగలఁ గాలమేఘుని
కాశగాత్రుఁ బవిత్రునిం
ఘనవిహారకు రక్తతారకుఁ
గాంచనాంబరధారకున్
జనభయంకరు ఘోరకింకరుఁ
జండిమ ప్రతిశంకరున్
కనదుదార? కంటకుండల
కాంతు నంతఁ గృతాంతునిన్.

క. అప్పురుషుఁడు చేపాశము
విప్పకొనుచు రాఁగఁ జూచివిభునిన్ ధరపై
నొప్పగను డించి మ్రొక్కుచు
మెప్పగ నంజలి యొనర్చి మిక్కిలి భక్తిన్.

గీ. అయ్య యెవ్వర వీవు నా కాన తీవె
యడవి నిటు లున్నమమ్ము నీయెడవినియమ
ధర్మరాజునుబోలెఁ బ్రత్యక్ష మైతి
రేమి సేయఁ దలంచితి రోమహాత్మ.

చ. పగతుర నైనఁ గోపమునఁ
బాఱఁగఁ జూడని యాకృపాళునిన్
వెగటుగఁ జూచి చేరెదవు
నే నబలన్ మఱి యేమి నేర నా
మగఁ డితఁ డోమహాత్మ యన
మానిని నీమగఁ డౌటనే సుమీ
మిగిలినవారిఁ బంపక మె
మే మరుదెంచితి మేను గాలుఁడన్.

ఉ. అతులపతివ్రతాతిలక
వ్వాటను కంటివి నన్నుఁ గాన రా
నితరుల కేను ద్రోవ విడు
మీతఁడు సంతతవిష్ణుభక్తుఁ డో
యతివరో కాల మెవ్వరికి
నైనను దాఁట వశంబు గాదు పో

మిత్రఁ డిదె విష్ణులోకమున
కేఁగెడు మాపురిత్రోవగా ననన్.

క. హరిభక్తుల కేటికి నీ
పురిత్రోవ యటన్న లోకమున 'రాజ్యాంతే
నరకం ధ్రువ' మనువాక్యం
బెఱుఁగవె కొన్నాళ్లురాజ్యమేలఁడెయితఁడున్.

మ. అనుచున్ దొంతరచిక్కుఁద్రాటను నృప
ప్రాదేశమాత్రాత్మ జీ
వుని బంధించి యముండు పోవఁ గని పు
వ్వుంబోఁడి ప్రాణేశు వెం
టనె రానిమ్మని మ్రొక్కి పూలఁ బొదరిం
టం డాఁచి వెన్నంటఁ గ
న్గోనియున్ జూడక దక్షిణాభిముఖుఁ డై
ఘోరంపుమార్గంబునన్.

క. ధర్ముం డీగతిఁ జని చని
క్రూర్మిన్ సావిత్రిఁ జూచి కోమలి యటపై
దుర్మార్గము నడఁ జాలవు
నిర్మలమతి వలదు వలదు నిలువు మటన్నన్.

గీ. విభుని విడనాడి దుష్టులవెంటఁ బోవ
నదియ ధర్మాత్మ దుర్మార్గ మండ్రు గాక
వరునితోఁ గూడి సత్సహవాసముగను
మంచిత్రోవను బోవ సన్మార్గ మనరె.

క. కావున సన్మార్గం బిది
మీవెంటనె రాఁగ ననిన మెచ్చితిఁ దరుణీ
నీవల్ల భుజీవము వెలి
గా వేఁడుము వర మొకటియుఁ గరుణింతు ననన్.

ఉ. స్వామి మహాప్రసాద మల
సాల్వమహీపతినై చెలంగు మా
మామయు నత్తయున్ మొదటి
మార్గమునన్ బహురాజ్యవైభవ
శ్రీమహనీయులై ముదము
చెందుచుఁ గన్నులఁ జూచునట్టు లీ
వే మముఁ బాసి యెంత పల
వింతురొ కన్నులు గాన కవ్వనిన్

క. అన మంచిది నీ వీఁక నిలు
మనుచున్ వడివడిగఁ జనఁగ నంటిపఱచుచున్

వనితామణి యాదినమణి
తనయునకుఁ నెనరు పొడమఁ దా నిట్లనియెన్.

గీ. ధర్మదేవత వందు రందఱును నిన్ను
నన్ను నాభర్త నెడఁబాప న్యాయ మగునె.
వరునిజీవము నాదుజీవమును బెనఁచి
చేకొనఁగ రాదె నే నంత మీకు బరువె.

గీ. ఏడడుగులు మాటాడుచుఁ
గూడ న్నడచినను దెలిసికొన నేస్తము నీ
తోడంబుట్టినజమునకు
జోడుగ సమవర్తి నన్నుఁ జూడకు వలదే.

క. అనఁ దిరిగి చూచి తల్లీ
తనుదూఱఁగ నేమి నే స్వతంత్రుఁడ నటవే
కొనిపోవ నుంచిపోవన్
వనజాక్షుఁడు దక్క నొకరివశమే తలఁపన్.

గీ. ఇంత యేటికి నిన్ను వహించుకొనుచు
ద్దినము నీచేత నోమించుకొనినతల్లి
యగుట సావిత్రియును బిల్లతగులు వడిన
హంసియునుబోలి తిరుగు నియ్యాంబరమున.

క. తనచేతఁ గాక తక్కిన
ఘనులకు మొఱ చేసి చేసి కాకుండిన నా
వనరుహనయనుని వైకుం
ఠనివాసుని వేఁడుకొన నటఁ జనఁ దలఁచెన్.

క. ఇట్టు గనుక ధవునిజీవం
బిటు వేఁడక తగినవరము నేదైనను నొ
క్కటి వేఁడుము నే నొసఁగెద
దిటముగ నన మదిని బొదలు తెగువదొలంకన్.

క. కూఁతురు నల్లుఁడు నిచ్చట
నీతెఱ వగుమాట వినిన నెంత పొగులునో
మాతండ్రి యపుత్రకుఁడిఁక
నాతనికిన్ సుతులు నూర్వు రగువర మీవే.

గీ. అనిన నారీతి నిచ్చెద నడల వలదు
నిలువు నాతోడ నాతోడ నీవు రాకు
మనుచు బిఱబిఱచనియె మీయయ్య యనిన
ధర్మజుఁడు వల్కె మునికి సంతసముతోడ.

క. మాయయ్యపలుకు లెఱుఁగుదు
మాయెడ సావిత్రి చనియె నంటి వపుడు నా

రాయణుకడ కావుమా చే
మాయెఁదెలుపుతాపసో త్తమాయనివేఁడన్.

క. విని మార్కండేయమహా
ముని తా నిట్లనియె నట్లు మోహాముకతనన్
వినువీథినిఁ దిరుగ జగ
జ్జనని మహాయోగమూర్తి సావిత్రి దయన్.

శ. తనమనోహరుఁ డైనయవ్వనజభవుని
తోడుక పోయెద శ్రీపతికడ కతండు
తాను మనవిగఁ దెల్పి పాదములఁ బడినఁ
గా దనఁ డటంచు సత్యలోకంబు సేరి.

క. నిగనిగనిమిద్దెలో ము
ద్దుగ గాయత్రీసరస్వతులచే విద్యల్
వగవగను వినుచుఁ గనుచున్
దగుచున్ నగుచున్న వేళఁదానట్లు చనఁగన్.

సీ. వడి లేచి యిదె యమ్మవారు వచ్చి రటంచుఁ
గడమబోటులు మ్రొక్కి కడల నిల్వఁ
దా వీణతో లేచి రా వక్క యని సర
స్వతి మెదు రేఁగి చే సాఁచి దివియ

వేదాంత మడుగుటల్ వెస నిల్పి గాయత్రి
చెలియ ర మ్మనుచు నవ్వాలికి జరగ
రా రమ్ము రాఁగదే రావె రావో యంచు
నల్మోగంబులతోఁడ నలువ పిలువ
వచ్చెద నటంచుఁ దలగడవలను చేరి
యజునిచెవిలోన గుసగుస మని యటంచుఁ
గొంత యేకాంతముగఁ జెల్వఁ గొదవ వినక
మునుపె తెలయూఁచెఁ బోరాదుమనమటంచు.

క. మఱి వినుఁ డని గాయత్రీ
సరస్వతులు తెలుప వినుట చాలును మీారే
మెఱుఁగ రిది మొదటిపుట్టువ
యరసినచో నాకు నేర మగు నే వెఱతుణా.

గీ. అనిన సావిత్రి బ్రహ్మతో ననియె నీవు
స్రష్ట వన్నియుండి మఱచుటే స్రష్టతనము
నోరు మూసినఁ బెడతల నుడువు దనుచు
నలువ ని న్నెంతు రాజసం బలరె నిపుడు.

క. నీపాప మేమి సేయుదు
వాపాప మహిూ జనింప నటు చేసినదే

నాపాపము నాపాలిటి
యాపాపం బవ్వాలించు హరి గలఁ డింకన్.

మ. అదియున్ జూచెదఁ బోయి వచ్చెద నటం
 చందుండి సావిత్రి తా
మది భావించినయంత వేగ విరజా
 మాంగల్యరంగన్నదిం
గదియం జేరి కిరీటకుండలయుగ
 గ్రైవేయముక్తాసరాం
గదపీతాంబరశంఖచక్రధరులం
 గాంచెన్ సరూపాఖ్యులన్.

క. చూచుచు వైకుంఠపురం
బాచెంతం దోఁచినంత హరి ద్వారి యనుచర్
దోఁచినగతి వర్ణించుచు
నాచాయన్ రాజవీథి నరుగుచు నచటన్.

సీ. చతురంగబలములసందడిని సునంద
 కుముదు లుండెడుహజారములు చూచి
యందందుఁ బుష్పదంతాదు లాయత్తమై
 వసియించుకొలువుచావళ్లు దాటి

వచ్చినద్వారల విష్వక్సేనగరుడు లి
మ్ముల నిల్పు పెండ్లిచౌకలు గ్రమించి
సమయ మాద్యాక నీశ్వరనారదుల్ చద
రంగ మాడెడుచప్పరమ్ము లరసి
యువల శుకసనకసనందనాదు లొంటి
నగజచేఁ దత్త్వముల్ వినునగరు చొచ్చి
సమయ మడుగక నవమణిస్థగిత మైన
వనజనాభునిపడకయిల్ వడిగఁ జొరఁగ.

క. నిలునిలు మని జయవిజయులు
తళతళ మనుపసిఁడికట్లఁ దగుబెత్తముల౯
నిలుపఁగ నగి ననుఁ బోవ౯
వల దనునేకాంత మేమి నాకుం దడయే.

గీ. ఎన్నివరుసల నుత్తరు విచ్చినా నో
కింతత్తారతమ్యంబు లే మెఱుఁగలేరు
పోని మీ రైన నే వచ్చినా నటంచు
వడిగఁ జని తెల్పి రం డన వారు నగుచు.

క. ఓవెఱ్ఱితల్లి తెలియదె
మీవద్దనె కొలిచినారమే వా రెల్ల౯

మీవలె దుడుకులు చేసిరె
పో వల దన నిలువ లేదె పోపొ మ్మనఁగన్.

క. నే పోవ కుండ ననఁగా
నే పోవఁగనీ ననంగ నే పోదు ననన్
నే పోనీ నన నఱవఱ
లై పెదపెదమాట లయ్యె నవు డట్టియెడన్.

సీ. సందిటబో పట్టుసల్లి యున్నవిధంబు
పెదవి గ్రోలుచుఁ గొంత వదలుతీరు
నే మోము పలి కిప్పు డే మంటి ననురీతి
వినుమాట తప్ప నూఁకొ నెడుదారి
మఱిమఱి మితితప్పుమడుపు లందు తెఱంగు
గోట నొక్కినఁ దాళుకొనెడినీటు
చే విదల్చుచునట్టె చెవి యొగ్గుచందంబు
బయలు తప్పక చూపు పఱపుహొయలు
చూచి నాస్వామి యెక్కడఁ జూచె దిపుడు
క్షిక నాతోను నాతోన నీవు తెల్పు
మనుచు నిందిర తను వేఁడ నల్ల నగుచు
వనిత మఱి యేమి లే దని వరదుఁ డపుడు.

సీ. బురుసారుమాలతో నరవిడువిరిపూల
నొగి జాఱుసిగ కేల నొత్తికొంచు
వడి లేచుచోఁ జుంగు పుడమిఁ జీరుపసిండి
నీటుదుప్పటి వల్లెవాటు గొంచు
మినుకుజన్నిదముతో మెలిగొన్న ముత్యంపుఁ
తెలిసరుల్ చిక్కులు దీర్చుకొంచు
మొదటఁ దబ్బి బ్బాట మొనవ్రేళ్ళఁ గై జాఱు
నుంగరంబులుఁ జక్క నంచుకొనుచుఁ

జిటులుగంధంబు చెక్కులఁ జెమరుచెమట
చెదరుతిలకంబు చిఱునవ్వు చెన్నుదొలఁక
జిలుగుపావలు ద్రొక్కక కలిమిచెలువ
యొసఁగుకైదండతో వింతసొగసు మీఱి.

క. వాకిటికలకల మే మని
శ్రీకాంతుఁడు వెడలి నలువచెలువం గని యే
మీ కోడల నీకలకల
మాకానరుతాళుకొనుము మముఁజూచియనన్.

చ. పదములమీఁద వ్రాలి సిత
పద్మవిలోచన బంధమోచనా

వదనవిధూతచంద్ర శివ
    వర్ణిత నిర్మలకీర్తిసాంద్ర నీ
రదసమగాత్ర! లోకనుత
    రమ్యచరిత్ర భవత్కటాక్షముల్
బదిలముగాఁగ నమ్మి యొక
    బాలను జేరిడి నేను పెంచితిన్.

క. దేవర సకలం బెఱుఁగుదు
రావనితకుఁ బ్రాణనాథుఁ డగువిమలాత్ముం
డావకభక్తునిఁ గొని యదె
పోవుచునున్నాఁడుజముఁడు పొరిఁదనపురికిన్.

గీ. అనఁగ నంతలోన నతిరయంబున నొక్క
విష్ణుదూత వచ్చి వినయముగను
దేవదేవ స్వామి దేవరభక్తునిఁ
బూని జముఁడు తోడుకపోఁ దొడంగె.

మ. అనుమాటల్ విని యేడ నేడఁ బద యీ
    నా దేవి నీ వాడువాఁ
డును వాఁడేకద కూడి రమ్మనుచుఁ జూ
    డ్కుల్ భూమిపైఁ బాఱ నె

వ్వనిదిక్కున్ గనుఁగొనక పేరుకొని వి
ష్వక్సేనునిన్ బిల్చి నీ
వును నీవారలుఁ గొల్వచావడిన ని
ల్వుం డంచుఁ జే వీచుచున్.

క. గుబ్బలబరువున వడఁకెడి
లిబ్బులబిబ్బోకవతిని లీలం గేలన్
గొబ్బునఁ గౌఁగిటఁ జేర్చుక
నిబ్బరమున గరుడు నెక్కి నిండినవేడ్కన్.

సీ. మొనసి పన్నగవైరి తనఱెక్కలు ముడించి
కొని వగఁ దగ మోట్టుకొనుచుఁ జనఁగఁ
దగిలి చిల్వలరాజు తనవేయుపడగల
గొడు గెత్తి బునకొట్టుకొనుచు నడవ
నంటి వేలుపుమౌని యరవీడుజడలతోఁ
దనవీణ పలికించుకొనుచుఁ బఱవఁ
గదిసి తక్కినవార లదె మించె నిదె కూడు
కొనుఁ డంచు వగరించుకొనుచు నరుగ
మించి గిబ్బ తేజీ దుమికించుకొనుచు
దేవి సావిత్రి యచ్చటి త్రోవఁ జూప

వెనుక బ్రహ్మాదు లింతంత వెంట నంట
నశ్వపతిపుత్రి కపుడు ప్రత్యక్ష మయ్యె.

క. ఈకరణిఁ గరుణతోడను
వైకుంఠనివాసుఁ డైనవనజాక్షుఁడు ప
ద్మాకాంతాయుతవక్షుఁడు
వీకంబొడచూపభయమువినయముతోలఁగన్.

ఉ. ఆయెడ మ్రొక్కుచున్ ముకుళి
తాంజలి యై చెలి సన్నుతించె నా
రాయణ వాసుదేవ హరి
యచ్యుత కేశవ నారసింహ కం
జాయతపత్రనేత్ర దను
జాంతక మాధవ పక్షివాహ నా
కాయము నాదుజన్మమును
గన్నులుఁ బావన మయ్యె మీదయన్

నాగబంధము.

చ. నగహరి దేహసార సుజ
నా జగదుత్తమ యేకవీర మం
దరధర పూతహారసర
నారదవిగ్రహ గారమేదురాం

బర శుక మోదకార జన
　　మానవవర్ణిత శౌరి కోవిదా
చరణ రమామనోరమణ
　　బాణకరచ్ఛిద ధీరపావనా.

సీ. ఈఁదుచు జలరాశిపైఁ దేలు దొకవేళ
　　నూరకే మునిఁ గుందు వొక్కవేళఁ
బొలుపుగా మొగముద్రిప్పక యుందువొకవేళ
　　నుగ్రంబుగాఁ జూచె దొక్కవేళఁ
బ్రభువులఁ జే సాఁచి బ్రతిమాలు దొకవేళఁ
　　జక్కఁగాఁ జెండుదు వొక్కవేళ
రాజవై ధర యెల్ల రక్షింతు వొకవేళ
　　గ్రక్కునఁ బెకలింతు వొక్కవేళ
నుందు వొకచోటఁ గదలక యొక్కవేళ
దిక్కు లల్లాడఁ దిరుగుదు వొక్కవేళఁ
బరిపరివిధంబు లగుమీ ప్రభావ మెఱుఁగ
బ్రహ్మ కైనను దరమె యోపద్మనాభ..

ఉ. ఇంతటిమీ మహామహిమ
　　యించుకయుం గననైతి నంచుఁ గొం

డంతటివాఁడు గ్రుంగఁబడి
యల్లదె మ్రొక్కి నుతించసాగె నీ
యంతకునిన్ భవత్కరుణ
నారయఁ జీతనిచేత నామనః
కాంతునిప్రాణ మున్న దటు
గావున స్వామికి విన్నవించితిన్.

మ. అని నానాగతులన్ నుతింప వరదుం
డాకాలునిం జూచి నే
మునుపుం జెప్పనె యెంత తెల్పినను నీ
మూఢత్వమే పోకపో
యె నయో యాతనివిష్ణుభక్తి వినవో
యీ సాధ్విచారిత్రమున్
మనసావిత్రి వహించుటల్ కనవొ వై
నా యింత గర్వింతువే.

ఉ. అంతక నిన్ను నీపురికి
నంపుదు నింతకు నేఁటికీ మహీ
కాంతుఁ గృపాంబుధిన్ బ్రదుకు
కంటి పతివ్రత లున్నత్రోవ నీ

వింతటినుండి పోయిన స
హించను నీమన సాచుఁ బల్కి యో
యింతిరో నీకు నీపురుషు
నిచ్చితి నీపతిభక్తి మెచ్చితిన్.

గీ. వనిత వేఁడుము౦డ్ల కైదువతనము గలిగి
యింట సంపద పూలచే రెత్తినట్టుల
కలిగి కొడుకులు మనుమలు కల్గి మనుము
తరుణి నానాఁటఁ దామరతంప రగుచు.

మ. అని దీవించుచు శ్రీనివాసుఁ డటఁ దా
నంతర్హితుం డైన వెం
టనె బ్రహ్మాదులు పోయి రంత నృపు ప్రా
ణంబుల్ జముం డిచ్చి పో
యెను సావిత్రియు నాపతివ్రతను దా
నెంతేని దీవించి యా
త్మనివాసంబున కేఁగె నం చనఁగఁ బ్రే
మన్ ధర్మరా జిట్లనెన్.

గీ. ఎంతభాగ్యవతియొ యెంచంగ సావిత్రి
యెంత దేవిఁ గొలిచి యముని గెలిచె

శంఖచక్రధరుని సత్యంబుగాఁ జూచెఁ
బులక లొదవె నవలఁ దెలుపుఁ డనిన.

శా. అంతన్ ధర్మనృపాల వింటె సతి తా
నానందవారాశిచే
నంతస్తాపము లెల్లనుం దడిపి య్యా
హా నోముమే లంచుఁ ద
త్కాంతారంబులు దాటి యొక్కపాదపాం
తం గాంతుదేహంబు దా
నెంతే హేలను దీయుచున్ దొడలపై
నింపొందఁగా నుంచుచున్.

ఉ. కాంతునిమోము గాదిగను
గన్గొని చూచుచు నుండునంతలోఁ
గొంతటు కన్నులం బులుము
కొంచును నిద్దుర మేలుకొన్నటా
గెంతయుఁ దోఁప లేచి యిది
యేమి పడంతుక లేవ నైతి వీ
పొంతల నింతగా నిదుర
పోవఁగ నిత్తురె ప్రొద్దు వ్రాలెడిన్.

మ. కలకంఠీ కల గంటి నే నొకటి యిం
కం దెల్విరా లేదు న
న్నెలుఁ గొక్కండు గ్రహింప వెంటఁ బడ నే
నెందేని నేఁగంగ న
వ్వల వేఱొక్కపడంతి యొక్కరునిఁ దే
వాఁ డామృగంబున్ శరం
బుల నేయన్ విడిపించుకొంటి నదియే
మో చూచిన ట్లయ్యెడిన్.

ఉ. అన విని నవ్వి మంచికల
యౌ నిది నీకల రేపు విప్పెదం
గనుఁగొను మల్లపశ్చిమన
గంబున నర్కుఁడు గ్రుంకెఁ బైపయిం
దనుజులఁ బోలి గాయములఁ
దాఁకుట నెత్తుటఁ దోఁగి నిల్వఁజా
లనికతనన్ ధరం బడిన
లాగు గనంబడెఁ జూడఁ జూడఁగన్.

చ. తొడతి జముండుఁ దానుఁ దవ
దూతలతో రవిఁ గ్రమ్ముకొన్నయా

వడువునఁ జీకటుల్ గవిసె
వల్లభ నద్దెస వానిఁ దోలఁగా
నుడిసినవేల్పులో యనఁగఁ
జుక్కలు రాజిలె నేదదేటి మె
ప్పడుబలెఁ దెల్వితో నిలిచెఁ
బొల్తి ద్దనఁగా నెల దోఁచెఁ దూర్పునన్.

క. అని యుపమ మీఱఁ బల్కిన
విని యా నా నతనికీర్తి వెలసినరీతిన్
జెనఁగొని నలుదెస వెన్నెల
కనఁబడె నిది పట్టపగలు గావలెఁ జూడన్.

ఉ. కాంతరో చూడు త్రోవ యిదె
గానఁగ నయ్యెడు మెల్లమెల్లనే
యింతటఁ బోవఁగా వలయు
నింటికి నొంటి నిటుండ రాదు నో
వంతగ లేదొడల్ చులుక
నైనది తల్లియుఁ దండ్రి నేఁడు తా
మెంత విచార మందిరొక
దే ననుఁ బాసిక నేమి సేయుదుర్.

సీ. గడియలో నలువమాఱు కౌఁగిట నన్నుఁ జేర్చి
యొడ లెల్లఁ దడవక యుండలేరు
నిమిషంబు తమచెంత నిలువ కుండిన నన్ను
నొకటఁ బేర్కొని పిల్వ కుండలేరు
గోరంతసేపు నేఁ గూరకుఁ బోయున్న
నూఁతకా లూని రా కుండలేరు
క్షణము నే భుజియింపక పరుండినను శౌరి
కొగి మ్రొక్కి మీఁ దెత్త కుండలేరు

పండి పడ నున్నపండు లై యుండువారు
రెండుకన్నులుఁ గానరా కుండువారు
నాకుఁ బలవించి పలవించి నన్నుఁ దలఁచి
తలఁచి త్రా రేమి తలఁచిరో తెలియరాదు.

చ. అడవుల మాకడక్ దపసి
వై యొకరాజ్యసుఖంబు లేక ని .
న్నడలఁగఁ జేసెనే నలువ
యాకలముల్ గొని తెచ్చె దయ్యొ నా
కడుపునఁ బుట్టి యిందు కొడి
గట్టఁగఁ జేసెను దైవ మయ్యయో

కొడుక యటంచు నా కడలు
కూరిమి తల్లిపు డెంత గుందెనో.

క. సంతానమువలె నీ వొక
సంతానము గలిగి తిదియు సంపద యని న
న్నెంతయుఁ గొనియాడును నేఁ
డింతీ నాతండ్రి చింత నెంత పొగిలెనో.

మ. అని చింతింపఁగఁ గాంతయుం బొగిలి దుః
ఖాక్రాంత యై కాంతునిం
దనహస్తంబుల వ్రాల్చి యెత్తి తెలివొం
దం జేయుచుం గౌఁగిటం
గొనుచున్ దేహము దుమ్ముపోఁ దుడుచుచున్
కొప్పున్ ముడిన్ వైచుచున్
దనడాకేలఁ గుతారమున్ గరిడియుం
దాఁ బూని లీలాగతిన్.

గీ. తనదువలకేల నతనిమే నొనర గ్రుచ్చి
యతనిడాకేల నెగనెత్తి యానుకొనఁగఁ
దనదువలమూపుపై నుంచి ధవుని నచట
వనిత మెల్లన నడిపించుకొనుచు మగిడె.

ఉ. ఇక్కడ నాశ్రమస్థలిని
వృద్ధులు పుత్త్రుఁడు రాక యున్కికిం
బొక్కుచు నాల్గుదిక్కులకు
మోములు ద్రిప్పుచు బారఁ జూపుచున్
వెక్కుచు నోకుమార యని
వేమఱు గొంతులు రాయఁ గూయుచున్
జెక్కులు దీయుపక్షు లన
నిల్చి రిఁ కే మని తెల్ప నవ్వెతన్.

శా. ఈలీలం బలవించుచున్ గరము లెం
తేఁ జాఁపుచున్ మింటికై
యోలోకేశ్వర యోగజేంద్రవరదా
యోప్రాణిసంరక్షకా
యోలక్ష్మీపతి మాకు నీవె శరణం
బోతండ్రి మాపుత్త్రునిం
బాలుం గానఁగఁ జేయు మంధకుల మా
పద్బాంధవా యం చనన్.

ఉ. అంత వరప్రభావమున
నప్పుడె కన్నులు వచ్చి నద్దెసన్

వింతగ దంపతుల్ గనుచు
నేఁ డిది యేమి సుతుండు రానిబల్
వంతఁ జరింపఁ గన్ను లెటు
వచ్చె నటంచును గన్నులందు నీ
రెంతయు నాన నెప్పటిర
హీన్ గను గాననివారలున్ బలెన్.

క. తడఁబడుచు నడవి నలుగడ
నడలుచుమునివరులఁగొడుకునడుగుచునుండన్
బడఁతియుఁ దాను సంతస
మడరఁగ నలసత్యవంతుఁ డపు డేతెంచెన్.

చ. తనయునిఁ జూచి బారఁగొని
తల్లియుఁ దండ్రియుఁ గౌఁగిలించి మో
ము నెడఁద మోపుచున్ శిరము
మూర్కొని పేర్కొని యోకుమార బా
లునివలె నింతసే పడవి
లోఁ జరియింపుదు రయ్య మాను లె
ల్లను దెలుపంగఁ బ్రాణ మొక
లాగున నిల్చితి మేమి దెల్పఁగన్.

క. నావుడుఁ దండ్రీ యేా నని
తా వనికేఁగుటయు బడలి తా వ్రాలుటయున్
దా వెగటుగఁ గల కనుటయుఁ
దా వచ్చుట దెలుప సాధ్వి తానిట్లనియెన్.

సీ. ఓమామ నారదుం డొకనాఁడు దెలిపె నీ
 ఘనునకు నేఁటికి గండ మనుచుఁ
గాన నేఁ డితనితోఁ గాననంబున కేఁగి
 నే నుండ నీతండు నిద్రవోవ
జముఁడు ప్రాణము గొంచు జరగనే వెంటనె
 చన దయచేసె నాజముఁడు నాకుఁ
గొన్నివరములు మీకు నయనముల్ రాజ్య
 మును గల్గ మాతండ్రి తనయులఁ గనఁ
దుదను నే నోముసావిత్రి తొడుక రాఁగ
నపుడు మనపాలి శ్రీకాంతుఁ డరుగుదెంచి
మీతనయుజీవ మిప్పించి మిగుల నన్నె
దయను దీవించి చనె నని తరుణి పలుక.

గీ. పులక లొదవంగ నానందజలధిఁ దేలి
నిలిచి దంపతు లోతల్లి నీవు గలుగ

మళ్ళి బ్రదికితి మాపద లెల్లఁ బోయె
వనిత మాపాలి భాగ్యదేవతవు నీవు.

క. అని కొనియాడఁగ నచ్చటి
మును లాగుణవతికి సతికి మ్రొక్కుచు నెంతే
వినయమున వారుఁ దాముం
దనరుచు నుండంగ నొక్కనాఁ డరుదందన్.

ఉ. ఉక్కడగన్ దగన్ బదుగు
రూడిగముల్ వెనువెంట నంటి రాఁ
జుక్కగతిన్ గతిం గులుకు
చున్ దెలిమించువయాలితేజిపై
నెక్కి హుటాహుటిం దనయ
నెప్పుడు చూతు నటంచు నశ్వరా
జక్కడి కేఁగుదేఁ గని
యందఱు నెమ్మది సంభ్రమించుచున్.

గీ. అపుడు మ్రొక్కెడువారు మే లడుగువారు
మెచ్చుకొనువారు దీవన లిచ్చువారు
నగుచు నొక రొక్క రటు నిటు నరుగుచుండ.
బ్రహ్మచారి యొకం డటు పాఱుదెంచి.

సీ. పొదివె నల్లదె మహాద్భుతధాటి రథకోటి
పటుకేతుపటపటపటలతోడ
నడచె నల్లదె మదోన్నదమదావళఘటల్
మణిఘంటికాఘణంఘణలతోడఁ
గవిసె నల్లదె నిరాఘాటఘోటకము లు
త్కటఖురాహతచిటపటలతోడఁ
జేరె నల్లదె రణశూరవీరభటాళి
బహుళకూజితకహాకహాలతోడ

సాల్వపుర మంట చండప్రచండవీరు
లనెడువారంట ముగురంట యదిగొ చూడుఁ
డీడ కేనంట వచ్చుట లీనృపాల
వరుల పైకంటచనుడంచుఁ బలుక నపుడు.

సీ. పులితోళ్లు నారచీరలతోడ బంధించి
దర్భగంటులలోన దాఁచువారు
కలశ కమండలువుల మొలబంటినీళ్లలో
ముంచి కానక యుండ నుంచువారు
సమిధల మోపు పచ్చనియాకులను గప్పి
తొడిఁబడఁ బొదలలోఁ దూర్చువారు

యజ్ఞసాధక మైనయరణులకోవులఁ
జెట్టుపైఁ గొనగొమ్మఁ గట్టువారు
గుమిగఁ బసిబిడ్డ లిల్లాండ్రు తమరుఁ గూడి
వడి నిజాశ్రమభూమికి వచ్చువారు
నైన మునిముసినవ్వాతో నరయు చుండ
నృపుల కిట్లనె నొకచారుఁ డెదుట నిలిచి.

క. ఖండించెద మని వీరుఁడుఁ
జండుఁడును బ్రచండుఁడిదిగొ చనుదెంచిరి మీ
రుండకుఁ డిఁక నెట కేనియుఁ
బొం డెఱిఁగించితిని నేను బూర్వుం డగుటన్.

వ. అని పలుక సత్యవంతుఁ డలుక పొడమి తన
పడంతికనుసన్నఁ గదనంబునకుఁ గదలుతను
కంబునం దనువునఁ బులకజాలంబు లొదవ
జననీజనకులకును మామకుం బ్రణమిల్లి దృఢ
కఠోరంబగు కుఠారంబు కేలం గొని యశ్వపతి
యనుమతి నతనితురంగారోహణంబుఁ జేసి
యుద్ధసన్నద్ధుండై గొబ్బున నబ్బలంబుల కెదురు
కొని నడవం గని చండ ప్రచండవీరు లుద్దం

డభుజాదండమండలీకృతకోదండు లై యెం
డొరులం బురికొల్పి ముంగలం జతురంగబలం
బులం గవియింపం బెంపున నప్పుడు పోడమం
బ్రొద్దుపైపయిం బెళపెళన యుఱుమునుఱు
ములం దళతళ మెఱయుమెఱుపులం గ్రమ్మ
పోడిపోడిమబ్బులయుబ్బునం బెడబొబ్బలన్
ధగద్ధగ విచ్చుకత్తులం జుట్టి ముట్టిన నట్టెట్టి
యత్తెట్టుల పైకిందొలివఘోటకంబు నూఁకి
యరుణకిరణసమానానూన నానాబాణజాలం
బులం బఱపిన నవి పుట్ట వెడలు పాములవడు
వున నేదు చిమ్మినకైవడిం గఱుఁదుఱుఁగలు
మూఁగినబాగునన్ జల్లువాన గొట్టినపెల్లున
రాలరువ్విన తెఱంగున రింగురింగున బిసబిసం
గవిసిన నవిసినరథంబులుం గెడసినగజంబు
లుంబడినతురంగంబులుం జడిసినబలరిబులుం
దునిసినవిండ్లును రాలినభూషణంబులున్ దొర
లుగొడుగులును విఱుగు కేతనంబులును
ప్రేవులు మెదడులుగుప్పలు నెమ్ములతెట్టలు
నెత్తురు వఱదలు కండలు మెండును నై సం

గరాంగణంబు గంధసింధురంబు నీరాడిన కెం
దామరకొలని చందం బందె నందుఁ జందుం
డరు దంది నిజస్యందనంబు బిఱబిఱం గుటి
పడం బైపడం దఱిమిన కేడించి తురంగం
బెదురుకొలిపి యమ్ములొక్కమ్మడిం గ్రుమ్మరిం
చినవిధంబున మర్మంబుల నాటి తేఁపీఁటం
గ్రుచ్చికొన నేసినవిగతాసుం డయ్యె నత్తేరున
కత్తించినబొమ్మకై వడిం గదలక యుండె నంత
నంతకాకారుండగు ప్రచండుం డుద్దండవేదం
డంబేటవాలుగా దులదులం బఱపిన నావాజి
వాగెమలఁచి వానికింజుట్టు కేడెంబుగాఁ గొంత
వడిం ద్రిప్పుచుం గేలిసింగిణీ నతనికంధరంబు
నం దగిలించి దిగఁదీసినం దు నిసి చతికిలంబడి
వేదండ ? కడుపునం దానును బందివిధంబునం
బొరలుచుఁ బ్రాణభీతి నొకకేల గజరిబుదిక్కు
నకు నొకకరంబు తనదిక్కునకు నొడ్డుకొనం
బకపక నగుచుఁ గఱకు నేజా గొనిమొన
చూపుచుఁ గొంతయుడు కాడించి యం
తం మణ రాజిల నాజానేయంబు ద్రిప్పినప్ప

డిన బోసకుండు దిగులునం గడసె నది విలో
కించికొంతకొంత వగచుచు నాసత్యవంతుండు
తన తేజీ కంధరంబు కరారవిందంబున నప్పళిం
చుచు మొగంబు దుడిసి చెవి నిమిరి మెల్ల
మెల్ల నెరవఁ గాలున నెడ నెడ నడిపింప నదిదూ
రంబునం గని వీరుండు భండనవీరుం డగుచుఁ
గరంబుల వాలునుం బలకయుఁ బొదల నిజ
తురంగం బారాజపుంగవుమీఁదికిం బఱపిన
దురదుర నెదురుకొని పట్టిన పట్టెంబు నఱికి
నద్దంప తిరిగి మరలం బురికొలుపుకొని
యిద్దఱు సరియుద్దు లనం గొంతప్రొద్దు ముద్దు
ముద్దుగా ముద్దుగుమ్మలు కోలాట లాడు
వేడుకం గత్తిగతియుఁ ఫెళ ఫెళనునాదు
నాదారకుండ నొండొరుల కుఱికి నఱుకు
లాడుచుండ నవ్వీరుండు కొండొక బెండువడి
చండితనంబునం గండుమిగిలి పేరువాఁడి కే
డెంబుమఱుంగునం గుంగిలి ముంగలకునొ నిగిడి
చుఱుకుచుఱుక్కునం గొనచిమ్ములు చిమ్మి
కమ్ముక యెుక్కుమ్మడి నడిదమ్మునకు ఎసర సరకు

గొనకపలక మెలఁకువ నది నపిల యదియును
నిదె తునిమెద నని తల ఖుఱికి నఱక మఱుఁ
గిడినపలక తునుకతునుకలై పోవం దలపునుక
పగిలెనోయని కేలం దడవిచూడఁ గలకల
నగి తప్పెఁ దప్పె వెఱపకు మ్మని నీకు నిది
నిజంబు చేసెదనని వెనవెన వెనుక కొదుగు
కై వడి తత్తడిం దొడల మెలంకువం దెప్పునఁ
బైకి నూఁకి నిజమండలాగ్రంబున వానిమేను
రెండుతుండెంబులుగా నఱకినం దక్కినవా
రలు జయజయరవంబులతో శరణంబులు
వేఁడినఁ గరుణారసంబున వారి నాదరించి మో
దంబున నున్నయన్నరేంద్రునిమీఁద దేవతా
గణంబులు పుష్పవర్షంబులు గురిసిరి నార
దుండు దండె మీటుచుం గడుపు చల్లఁ జేసితి
వని దీవింపం దొడంగె నప్పు డాజయవంతుం
డగుసత్యవంతుండు తక్కినచతురంగ బలం
బులుం గొలువ వందిమాగధులు బిరుదు కై
వారంబులు చదువఁ దా నరుల నుఱుము
చేయుటల నభినయించు తెఱంగునం గఱి.

కలన కళ్ళెంబున ములుచు తనకీర్తి దిక్కు-
లకుం జాటు నీటున నోట నిగనిగనినురువులు
పరికించుచుఁ జెలంగుతురంగంబు నాడ నాడ
జోడనలు త్రొక్కించుచుఁ దెల్లజల్లులు విచ్చుక
తెక్కులగతి నిక్కి చూప నచ్చటచ్చట దుమి
కించుచుఁ నిజాశ్రమంబునకు వచ్చి ముచ్చ
టతో నందఱికిఁ వందనంబులు చేసి దీవనలు
గైకొని యిది యంతయు దేవరప్రభావంబు
గదా యని కడగంట సావిత్రికడం గని
నేర్పు గులుకఁ బలుకుచు నానందకందళిత
హృదయారవిందుం డై సంతతారాధితగో
విందుఁ డై సుఖం బుండునంత.

చ. హితులుఁ పురోహితుల్ సచివు
లెంతయుఁ బెద్దలుఁ బూర్వభృత్యులున్
మతి గలవారుఁ బౌరులును
మంత్రులుఁ గూడి నుతించి మే మిఁకన్
బ్రతుకుదు మీవు రాజ్యపరి
పాలన చేసిన రమ్మటంచు స

మ్మతపడి పిల్వ సాల్వపతి
మంచి దటంచుఁ బ్రమోదితాత్ముఁ డై.

గీ. అచటివకానుల నందఱి నభినుతించి
వాసి నిన్నాళ్ళు మీగర్భవాసమునను
నునిచి పోషించితిరి దయ మఱవ్ల కెప్పుడు
మముఁగటాక్షింపుఁడనిపల్కి సుముఖుఁడగుచు.

సీ. తనమేలు కెదురు చూచినబాంధవావళి
రథముల నుభయపార్శ్వముల నరుగ
నింత నంతట భద్రదంతావళం బెక్కి
చతురంగబలముతో సుతుఁడు నడవ
లలితసంగీతమేళముతోడ మద్రేశుఁ
డును దేజి దుమికించి మునుచనంగఁ
దళుకుఁబచ్చలపల్లకుల నెక్కి వరుసగా
నమరి కాంతయుఁ గోడ లంటి రాఁగ
భేరిభాంకారరవములు బోరుకొనఁగఁ
గ్గులుకు మీఱుకుమారునందలములోన
నలద్యుమత్సేనభూపాలుఁ డరిగె నపుడు
తనరుప్రాగ్జ్యోతిషం బనుతనదుపురికి.

చ. చని మఱునాఁడు తా సకల
సంభ్రమముల్ తనరంగ సత్యవం
తునకును గట్టెఁ బట్టము జ
నుల్ కొనియాడ నతండు తండ్రికం
టెను గుణి యై భరింప ధర
ణిన్ సరి సేయఁగఁ గూడఁ దా నరేం
ద్రున కల రాజసమ్మునకు
నున్ మఱి శేషుని దిగ్గజంబులన్.

సావిత్రీచరిత్ర సమాప్తము.

క. తంజాపురిరఘునాథుని
లంజెగొ యతఁడోవ చోవిలాసము మెఱయన్.
రంజిల్ల బుధులు రచనా
మంజిమ సావిత్రిచరిత మహి రచియించెన్.



